Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్ రైతు

సంపుటి: 82 • సంచిక: 13 • 30-3-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# క్షణక్షణం వైఎస్సే గుర్తుకు వస్తున్నాడు!



వైఎస్ రాజశేఖర్‌రెడ్డి లేని లోటు కాంగ్రెస్ పార్టీలో ప్రతిక్షణం కళ్ల ముందు కదలాడుతూనే ఉంది. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఎదుర్కొంటున్న తీవ్రస్థాయి అసమ్మతి, దాన్ని ఎదుర్కొనలేని ఆయన అసహాయత, దాని ఫలితంగా రోజురోజుకు దిగజారి పోతున్న ప్రభుత్వ ప్రతిష్ట, పార్టీలో ఏర్పడుతున్న గందరగోళం వంటి పరిణామాలు చూసిన ప్రతి ఒక్కరి మదిలో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి మెదలుతున్నాడు.

1999 నుంచి పదేళ్లపాటు ఆయన పార్టీని నడిపిన తీరు చూసిన వారికి అటువంటి బలమైన, రాజకీయ చతురత కల్గిన, నేర్పు, ఓర్పు కలగలసిన నేత కాంగ్రెస్‌కు లేకుండా పోయాడే అని ఆవేదన చెందుతున్నారు. రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ ఇప్పుడు దాదాపు అనాథ చందంగా మిగిలిపోతున్నది. యాదవకులంలో ముసలం వలె ఉంది పరిస్థితి. పార్టీ మీద ఎవరికీ అదుపులేదు. ఎవరికి ఎవరూ పెద్ద కాదు. వైఎస్ కూడా ఒకప్పుడు అసమ్మతి నేత అన్న మాట నిజం, అయితే ఆయన పక్కన పది మందో, పాతిక మందో ఎమ్మెల్యేలు ఉండేవారు. గద్దె మీద ఉన్న ముఖ్యమంత్రులను గడగడ లాడించే వారు. నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి కూడా కొంతకాలం అసమ్మతి వ్యవహారాలు నడిపాడు. ఆయన వెంట కూడా దండిగా ఎమ్మెల్యేలు ఉండేవారు. ప్రధాని హోదాలో పి.వి.నరసింహారావు ఆయన్ను ముఖ్యమంత్రిగా దిగమని ఆదేశిస్తే 150 మంది వరకు ఎమ్మెల్యేలు మీ వెంట మేమున్నాము, పివి మాట వినవలసిన అవసరం లేదని భరోసా ఇచ్చారు. అయితే జనార్ధన్‌రెడ్డి ఎప్పుడూ పార్టీకి, అధిష్టానానికి విధేయుడు కాబట్టి తన పదవి కాపాడుకొనే అవకాశం ఉండి కూడా రాజీనామా పెట్టాడు. మర్రి చెన్నారెడ్డి, కోట్ల విజయభాస్కర్‌రెడ్డి వంటి నేతలు వీరిద్దరికంటే బలవంతులు. వారిని చూసి అధిష్టానమే హడలి పోయేది. ప్రజలలో వారికున్న పలుకుబడి అందుకు కారణం.

జాతీయ పార్టీ అయినాసరే ప్రాంతీయ స్థాయిలో ప్రజాభిమానం, కనీసం ఎమ్మెల్యేలను అనుచరులుగా మార్చుకోగలిగిన నేర్పరితనం ఉన్న బలీయమైన నాయకత్వం ఉన్నంత కాలం వ్యవహారాలు సాఫీగా నడుస్తాయి. దురదృష్టవశాత్తు ఇప్పుడు కాంగ్రెస్‌లో ఆ మోస్తరు నేత ఒక్కడు కూడా లేడు. కిరణ్‌కుమార్‌రెడ్డి దాదాపు ఒంటరివాడు. ముఖ్యమంత్రిగా పీఠమెక్కిన తర్వాత కూడా ఆయన వెంట నడిచే అనుచర ఎమ్మెల్యేలు లేరు. ఆయన మీద అసమ్మతి నడుపుతున్న శంకరరావు, డిఎల్ రవీంద్రారెడ్డి, జెసి దివాకర్‌రెడ్డి, జానారెడ్డి, బొత్సా సత్తిబాబు తక్కుంగల బృందమంతా ఒంటరి పక్షులే. ఏ ఒక్కరి వెంటా చూపించుకోవడానికి కూడా మనిషి లేడు. పైపెచ్చు వీరిలో ఎవరు కూడా కనీసం తమ తమ జిల్లాలలో పార్టీని నడిపించే చావ కల్గినవారు కూడా కాదు. దానితో వారి అసమ్మతి పత్రికా ప్రకటనలకు మాత్రం పరిమితం అవుతుందే తప్ప ముఖ్యమంత్రిని ఇటు హైదరాబాదులోకానీ, అటు ఢిల్లీలో కానీ ఇరకాటంలో పెట్టే స్థాయికి చేరుకోవడం లేదు. అయితే రోజూ పత్రికలలో వచ్చే ఈ వార్తలు పార్టీని పలచన చేస్తున్నాయి. వాటిని నివారించే సామర్థ్యం ముఖ్యమంత్రిలో కన్పించడం లేదు. దానితో ఇక్కడ చీమ చిటుక్కుమన్నా ఢిల్లీ నుంచి పరిశీలకులు రావలసి వస్తుంది. ఒక రాష్ట్రం మీద అంత శ్రద్ధ, సమయం పెట్టే పరిస్థితిలో అధిష్టానం లేదు.

చల్లారి పోయిందనుకొన్న తెలంగాణ ఉద్యమాన్ని కెసిఆర్ తిరిగి రాజేయగలగడానికి కూడా కాంగ్రెస్‌లోని ఈ లుకలుకలే కారణమన్నది నిజం. ఆ నిప్పు మళ్లీ మంటగా ఎగసి పడుతున్నది. వైఎస్ వంటి నేత పార్టీకి అందుబాటులో ఉండి ఉంటే దాని మీద నీళ్లు చల్ల

కొరవ 14వ పేజీలో

# నిప్పుకు చెదలు

సైన్యాధిపతి పదవి సర్వోన్నతమైనది. దానికి ప్రధాన అర్హత దేశభక్తి. దానికంటే కీలకమైనది క్రమశిక్షణ. అంతకంటే మిన్నగా ఉండాల్సింది నీతి, నిర్భీతి. ఈ త్రిగుణాలే సైన్యాధిపతికి అలంకారాలు. ఇంతకాలం పనిచేసిన సైన్యాధిపతులందరూ సైన్యం ప్రతిష్టను పెంచారే తప్ప క్షీణింపచేయలేదు. జనరల్ కరియప్ప, జనరల్ మానెక్‌షా వంటి వారు భారత సైన్యాన్ని ప్రపంచంలోనే అగ్రస్థానంలో నిలిపారు. అందువల్లనే పొరుగునే ఉన్న పాకిస్తాన్ సైనిక తిరుగుబాట్లతో అరాచకమయంగా మారితే, భారత దేశం మాత్రం ప్రజాస్వామిక రాజ్యంగా కీర్తినందుకొన్నది. కానీ దురదృష్టవశాత్తు ప్రస్తుత సైన్యాధిపతి జనరల్ వి.కె.సింగ్ దేశం పరువు తీస్తున్నాడు. సైన్యం ప్రతిష్టను మంట కలుపుతున్నాడు. ఒకరకంగా చెప్పాలంటే దేశద్రోహివలె వ్యవహరిస్తున్నాడు. అత్యంత బాధాకరమైన పరిణామం ఇది.

వి.కె.సింగ్ కూడా సైనికుడిగా ప్రతిభావంతుడే. నిఖార్సైన వ్యక్తే. కానీ ఆయనలో చివరి దశలో స్వార్థం చోటు చేసుకొన్నది. పదవీకాంక్ష ఆవహించింది. రేపు మే నెల 31వ తేది రిటైర్ కావలసి ఉందాయన. అయితే సైన్యంలో చేరినప్పుడు తన రికార్డులో పుట్టిన తేదీని ఒక సంవత్సరం వెనక్కు జరిపారనే మిషతో పదవి పొడిగింపు కోరాడు. నిజంగా ఆయన పుట్టిన తేదీలో పొరపాటు జరిగి ఉంటే ముప్పై మూడేళ్ల పాటు ఏమి చేస్తున్నట్లు? ఇంతకాలం దాన్ని సరిదిద్దుకొనే ప్రయత్నం ఎందుకు చేయనట్లు? రిటైర్‌మెంట్ ముందు దాన్నొక వివాదంగా ఎందుకు మార్చినట్లు? ఇంత సర్వీస్ తర్వాత పుట్టిన రోజు రికార్డులు మార్చడం సరైన సాంప్రదాయం కాదు కాబట్టి, రక్షణ శాఖ ఆ అభ్యర్థన తిరస్కరించింది. దానితో ఆయన సుప్రీంకోర్టులో వాజ్యం వేశాడు. ఒక సైన్యాధిపతి తన స్వంత అవసరం కోసం ప్రభుత్వం మీద సుప్రీంకోర్టుకు వెళ్లడం చరిత్రలో ఇదే ప్రథమం. ఆ తప్పిదాన్ని గుర్తుచేసి, మెత్తగా మందలించింది సుప్రీంకోర్టు. అయినా సరే ఆయనలో మార్పు లేదు. రక్షణ మంత్రి ఎ.కె.ఆంటోనీ తన కోరిక మన్నించలేదనే కోపంతో విష ప్రచారం మొదలు పెట్టాడు. ఒక రిటైర్డ్ ఆర్మీ ఉన్నతాధికారి సైన్యం వాడే నాసిరకం ట్రక్కుల కొనుగోలుకు సహకరిస్తే 14 కోట్ల రూపాయల లంచం ఇవ్వజూపాడని ఆరోపించాడు. సైన్యాధిపతికి లంచం ఇస్తానని చెప్పే సాహసం ఎవరికైనా ఎట్లా వస్తుంది? అందుకు ఆయన అవకాశం ఎందుకు ఇచ్చాడు? ఏ బలహీనత ఆయన్ను వివశుడ్ని చేసింది వంటి ప్రశ్నలు చాలానే అడగవలసి ఉంది ఈ విషయంలో. దానిపై వివరణ ఇవ్వడానికి సిగ్గుపడిన ఎ.కె.ఆంటోనీ లోక్‌సభలో కంటతడి పెట్టవలసి వచ్చింది. ఆంటోని వంటి నేతకు ఆ పరిస్థితి తలెత్తడం నిజంగా దేశం చేసుకొన్న దురదృష్టం. నిప్పుకు చెదలంటించాలని చూసే దుష్ట ప్రయత్నం అది. దానివల్ల ఆంటోనీ ప్రతిష్టకు కల్గిన భంగం ఏదీ లేదు. ఆయనపై ఆరోపణలు చేయడం అంటే సూర్యుడిపై ఉమ్మేయడంతో సమానం.

ఆ వెంటనే జనరల్ వి.కె.సింగ్, మన సైన్యం శత్రువును ఓడించే సామర్థ్యం కోల్పోయిందని, ఆయుధ సంపత్తి లేదని, కనీసం పేల్చేందుకు చాలినన్ని తుపాకీ గుండ్లు కూడా లేవని ప్రధానికి ఒక లేఖ వ్రాశాడు. దాన్ని పత్రికలకు అందజేశాడు. ఒక సైన్యాధిపతి నేరుగా ప్రధానికి లేఖ వ్రాయడం తీవ్రమైన క్రమశిక్షణ ఉల్లంఘన. పై పెచ్చు సైనిక రహస్యాలను బహిర్గతం చేయడం దేశద్రోహ నేరం. నిజంగా సైన్యంలో ఈ పరిస్థితి ఉందా, ఉంటే ఇంతకాలం జనరల్ వి.కె.సింగ్ ప్రభుత్వం దృష్టికి ఎందుకు తీసుకొని రాలేదన్నది వేరే ప్రశ్నలు. సైన్యాధిపతిగా ఉంటూ సైన్యం ప్రతిష్టను మంట కలపడానికి, శత్రువుల బలం పెంచడానికి, దేశాన్ని బలహీన పరచడానికి ఆయన చేసిన కుటిల ప్రయత్నం మాత్రం ఘోరమైనది. ఆయన్ను ఇంక ఒక్క క్షణం ఆ పదవిలో కొనసాగించినా దేశం పరువు పోతుంది. తక్షణం పదవి నుంచి తప్పించి, మిలటరీ చట్టాల ప్రకారం ఆయన మీద కఠినమైన చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఇంతటి విషాద వాతావరణంలో ఒక్కటే సంతోషం. లోక్‌సభలో రాజకీయ పార్టీలన్నీ తమ తమ స్వార్థాన్ని పక్కన పెట్టి, దేశభక్తియుతంగా ప్రవర్తించడం. మీకు అండగా మేముంటాము, సైన్యంలో జరిగే పొరపాట్లు సరిదిద్దండి అని బిజెపి నేత అరుణ్ జైట్లీ ప్రభుత్వానికి మద్దతు పలికాడు. దాదాపుగా అన్ని పార్టీలు సైన్యాధిపతి దుర్మార్గాన్ని నిరసించి, ప్రభుత్వం పక్షం నిలబడ్డాయి. దేశ ప్రజలందరూ ఆనందించవలసిన రాజకీయ ఐక్యత అది.

## జనవాణి

### కమ్యూనిజం అజేయం

కోవూరు ఉపఎన్నికల ఫలితాలతో కమ్యూనిస్టులు సహజ మరణం పొందబోతున్నారని, జిల్లాలో అంతరించిపోయిన పార్టీలలో కమ్యూనిస్టులు ఒకరని మీరు ఎన్నికల విశ్లేషణలో వ్రాశారు. ప్రపంచంలో దోపిడీ ఉన్నంతకాలం కమ్యూనిస్టులు వుంటారు. అంతిమంగా కమ్యూనిస్టులదే పైచేయి అవుతుంది. కమ్యూనిజం అజేయం. సోవియట్ రష్యాలో సోషలిజం పతనమైన తర్వాత మనదేశంలోని బూర్జువాపార్టీలు, ఆ పార్టీల నాయకులు వారిని బలపరిచే మీడియా కమ్యూనిజం అంతరించిపోయిందని ఘోషించాయి. కానీ ప్రస్తుత ప్రపంచంలో జరుగుతున్న పరిణామాలు బూర్జువాపార్టీల అంచనాలను తలక్రిందులు చేస్తున్నాయి. కోవూరు ఉపఎన్నికల్లో పోటీ చేసిన మూడు ప్రధాన పార్టీలు ధనం, మద్యం నిస్సిగ్గుగా కుమ్మరించి ఓటర్లను ప్రలోభపర్చాయి. ఇక్కడ పార్లమెంటరీ ప్రజాస్వామ్యం బూటకమని నిరూపితమైంది. పత్రికలు ప్రజాస్వామ్యాన్ని కాపాడే ప్రయత్నం చేయక ఎవరో ఒకరి తలలో నాలుకలయ్యాయి. అధికార యంత్రాంగం ఎన్నికలు సరిగ్గా నిర్వహించలేక చేతులెత్తేసింది. కోవూరులో సిపిఎం తరఫున పోటీ చేసిన వెంకమరాజు నిజాయితీపరుడు, గ్రాడ్యుయేట్ అయివుండి ప్రజల కోసం పని చేస్తున్నా ఎవరూ అతని వ్యక్తిత్వ వైశిష్ట్యాన్ని ప్రజలకు తెలియజేయలేదు. సిపిఎం పార్టీకి పార్లమెంటరీ రంగం కూడ ఓ పోరాట రంగం. ప్రజలు కుహనా పార్లమెంటరీ విధానం మీద నమ్మకం వుంచినన్ని నాళ్లు ఎన్నికలలో పోటీ చేస్తాం. జనం గెలిపిస్తే అసెంబ్లీ, పార్లమెంటుల్లో ప్రజావాణి వినిపిస్తాం. అంతే తప్ప గెలిచేందుకు అడ్డదారులు తొక్కం.

పి.శ్రీరాములు — కావలి

### బిపిఎల్ హోదా గందరగోళం

ప్రభుత్వం ప్రకటించిన అన్ని రాయితీలు అనగా తెల్లరేషన్, ఆరోగ్యశ్రీ కార్డులు, ఉచిత గృహ నిర్మాణాలు, వ్యవసాయ పంపుసెట్లకు కొంతమేర ఉచిత విద్యుచ్ఛక్తి సరఫరా, ఉపకార వేతనాలు, ఉచిత బోధనా రుసుముల చెల్లింపులకు దారిద్ర్యరేఖ దిగువన ఉన్నవారు మాత్రమే అర్హులని ప్రకటించారు. అయితే దీనికి భిన్నంగా తెల్లరేషన్‌కార్డులు, ఆరోగ్యశ్రీ కార్డులు పొందేందుకు వార్షికాదాయం 40 నుంచి 70వేల రూపాయలుగా ప్రకటించి వున్నందున ఉన్నతాదాయ వర్గాలు ప్రయోజనం పొందుతున్నాయి. ఎస్‌సి, ఎస్‌టి వర్గాల వార్షికాదాయంలో రెండు లక్షల రూపాయల వరకు పరిమితి వుండడంతో ఈ వర్గాలకు వెసలుబాటు వుంది. తాజాగా ప్రణాళికా సంఘం ప్రకటించిన విధంగా ఐదుగురు సభ్యులుండే ఒక కుటుంబం పట్టణాల్లో 4,824 రూపాయలు, పల్లెల్లో 3,205లోపు ఖర్చు చేస్తే దారిద్ర్యరేఖ దిగువన వున్నట్లు అంగీకరించాలి. అంటే మనదేశంలోని 121కోట్ల జనాభాలో వీరు 40కోట్ల మంది వున్నారని లెక్కలు చెబుతున్నాయి. వీటన్నింటి కంటే ముఖ్యంగా ఆయా వర్గాలు ప్రకటించిన కులం, వార్షికాదాయం సరై

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

3-4-1942
పేజీలు : 8 వెల: అణా

### పోతన జయంతి

“పలికెడిది భాగవతము పలికించు విభుండు రామభద్రుండట”

అన్న పోతన జయంతి ఆ రామభద్రుని ఉత్సవాల తోటి ఉప్పొంగగా రాయాజివీధి భజన మందిరం వారు తేది 29 విజయవంతంగా జరిపిరి. ‘సహజ పాండిత్య’ పోతనామాత్యుని “బాల రసాల సాల నవ పల్లవ కోమల కావ్య కన్నియ”ను గూర్చి సరస కవి, విద్యా ప్రవీణ, విద్యాభూషణేత్యాది బిరుదాంకితులైన దిగ్దంతులు ఉపన్యసించిరి.

### నోట్లో మట్టి

కాలేజి కమిటీ 29వ తేది మీటింగులో ఫలాని వారి జీతాన్ని గూర్చి ప్రసక్తికి రాగా, ఫలానివారు అడ్డుపడ్డట్టును, రాజీనామా యిస్తాను చూడు అని జందెం పీక్కున్నట్లును కమిటీ వారు భయపడి, దద్దరిల్లి వెనక్కు యిరగబడి, గాభరా అయినట్లును, ఓటుకు బెట్టగా సంగోరు మేడిపాలు వహితేలగా ప్రెసిడెంటు గారి ఓటు కూడా వణుకుతూ పలానివారి ప్రక్కే మ్రొగ్గినట్లును, దాన్తో ఆ టీచరు నోట్ల మట్టిపడ్డట్టును శుకయోగీంద్రుడు పరీక్షన్మహారాజుకుం చెప్పె.

ఏమిటయ్యా పిల్లకాయల మాదిరి ఈ బెదిరింపులు, ఈ గాభరాలు?

### జిల్లా రిజిష్టారు

పి.సూర్యనారాయణరావు నాయుడు గారిని సేల్సుటాక్సు ఆఫీసరుగా విశాఖకు వేశారు. 1వ తేది ఛార్జీ ఇచ్చారు. సమర్థనీయులైన వీరి సేవను ప్రశంసిస్తున్నాము.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

30-3-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### రాజ్యసభ ఎన్నిక

ఆంధ్రానుండి రాజ్యసభకు పోటీచేసిన నాలుగు స్థానాలను కాంగ్రెస్ గెల్చుకోగలిగింది. శ్రీయుతులు కాసు వెంగళరెడ్డి, నూకల సర్వోత్తమరెడ్డి, వి.సి.కేశవరావు, శ్రీమతి చోడగం అమ్మన్న రాజా గారలు రాజ్యసభ సభ్యులుగా ఎన్నికైనారు.

కమ్యూనిస్టుల ఏకైక అభ్యర్థి కుమారన్ గూడా గెలుపొందాడు.

స్వతంత్రులలో అందరూ ఊహించినట్లు కాంగ్రెస్–కమ్యూనిస్టు మిత్రుడైన కె.వి.రఘునాధరెడ్డి విజయం పొందాడు. బెజవాడ పాపిరెడ్డి, భవానీప్రసాద్ ఓడిపోయారు.

### జి.ప అధ్యక్షునిగా చంద్రశేఖరరెడ్డి?

నెల్లూరు జిల్లా పరిషత్తు అధ్యక్ష పదవి చంద్రశేఖరరెడ్డి గారికే లభ్యమయ్యే అవకాశాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి. మంత్రి ఏ.సి సన్నిహిత వర్గాలలో విచారించగా కాంగ్రెసు సూత్రం ప్రకారం “ఒక వ్యక్తికి ఒక పదవి” అనేది అన్వయింపజేసి, అనుయాయులలో ‘పదవుల పంపిణీ’ విషయమై భేదాభిప్రాయాలు లేకుండా సర్దుబాటు చేసే సూచనలు హెచ్చుగా వినవస్తున్నాయి.

ఈ సూత్రం ప్రకారం చెంచురామానాయుడు గారు అసెంబ్లీ సభ్యుడుగా ఉన్నారు. కాబట్టి వారికి ఈ సారి పరిషత్తు అధ్యక్ష పదవి వద్దనే సలహా గూడా ఇవ్వవచ్చునని తోస్తున్నది.

చెంచురామానాయుడు గారి పేరు, డిప్యూటీ మంత్రుల జాబితాలో చేరుతుందా అనే విషయమై ఇక్కడ ఎవ్వరూ యేమీ చెప్పలేకుండా ఉన్నారు. అసలు డిప్యూటీ మంత్రుల నియామకము విషయమే ముఖ్యమంత్రి ఇంకా ఆలోచించటం లేదు. 3వ తేది ఢిల్లీ వెళ్లివచ్చిన తర్వాత సంజీవయ్య వ్యవహారం తెలుస్తుంది.

# నెల్లూరు ముచ్చట్లు విశేషాలు

## కలెక్టర్ విందు

కోవూరు ఉప ఎన్నికల విధుల్లో పాల్గొన్న రెవిన్యూ సిబ్బంది, అధికారులకు జిల్లా కలెక్టర్ తన బంగళాలో 26వ తేది రాత్రి విందునిచ్చారు. పిలిచిన వారంతా హాజరయ్యాక ఈ కార్యక్రమం మొదలు పెట్టడం ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు.

## జగన్, విజయమ్మలను కలసిన ప్రసన్న!

కోవూరు ఎమ్మెల్యేగా గెలిచిన నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ గౌరవాధ్యక్షురాలు విజయమ్మ, అధ్యక్షుడు వైఎస్ జగన్మోహన్ రెడ్డిలను హైదరాబాద్, గుంటూరులలో మర్యాదపూర్వకంగా కలసి కృతజ్ఞతలు తెలియజేశారు.

## రికార్డుస్థాయిలో ఉద్యోగుల సస్పెన్షన్!

జిల్లాలో ఇప్పటివరకు ఎప్పుడూ లేనట్లుగా నీటి యాజమాన్య సంస్థలో పనిచేస్తున్న 989 మంది ఉపాధి హామీ పథకం ఉద్యోగులపై ప్రభుత్వం సస్పెన్షన్ వేటు వేసింది. ఉద్యోగంలో చేరే ముందు ఉద్యోగులు వ్రాసిచ్చిన హామీ పత్రంలో పేర్కొన్న దానికి విరుద్ధంగా సమ్మె చేస్తుండడంతో 807 మంది ఫీల్డ్ అసిస్టెంట్లు, 111 మంది టెక్నికల్ అసిస్టెంట్లు, 37 మంది ఎపిఓలు, 34 మంది ఇంజనీరింగ్ కన్సల్టెంట్‌లను సస్పెండ్ చేస్తూ ఉత్తర్వులివ్వడం సంచలనం సృష్టించింది.

## బదలీలు

నెల్లూరు లోక్‌సభ, ఉదయగిరి అసెంబ్లీ నియోజకవర్గానికి త్వరలో జరగనున్న ఉప ఎన్నికలను పురస్కరించుకొని జిల్లాలో 30 మందికి పైగా ఎమ్మార్వోలు బదలీలు కానున్నారు. వీరితోపాటు చాలా రోజులుగా నెల్లూరులోనే పనిచేస్తున్న డిఆర్వో రామిరెడ్డి, డ్వామా పిడి యుగంధర్‌కుమార్‌లకు బదలీలు తప్పేటట్లు లేవు. రామిరెడ్డి మాత్రం ఎన్నికలు అయ్యేవరకు సెలవులో వెళ్లాలని యోచిస్తున్నట్లు తెలిసింది.



## ధాన్యాన్ని ప్రభుత్వమే కొనుగోలు చేస్తుంది!

రైతులకు పుట్టికి 9400 రూపాయల మద్దతు ధర ఇస్తూ ధాన్యాన్ని ప్రభుత్వమే కొనుగోలు చేస్తుందని జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్ ప్రకటించారు. జిల్లాలో రైతు పండించిన ధాన్యానికి మద్దతు ధరలేక ఇబ్బంది పడుతున్న ప్రస్తుత తరుణాన మండల కేంద్రాలలో ఏర్పాటుచేసే కొనుగోలు కేంద్రాలలో పౌరసరఫరాల శాఖ డిప్యూటీ తహశీల్దార్లు, మండల వ్యవసాయ శాఖ అధికారుల నేతృత్వంలో ఈ కొనుగోళ్లు జరుగుతాయన్నారు.

## కానిస్టేబుళ్ల ఎంపిక మొదలు

జిల్లాలో ఖాళీగా ఉన్న 300 మంది సివిల్ కానిస్టేబుళ్ల పోస్టులను భర్తీ చేయను అవసరమైన పరీక్షల కసరత్తు 26వ తేది మొదలయ్యింది. ఈ పోస్టుల భర్తీకి 6500 మంది దరఖాస్తు చేశారు. ఐదు కిలోమీటర్ల పరుగు పందెంలో ఉత్తీర్ణులైన అభ్యర్థులకు లాంగ్ జంప్, హై జంప్, షాట్‌పుట్, 800 మీటర్లు, 100 మీటర్ల పరుగు పందెంతోపాటు పొడుగు, ఛాతి కొలతలను పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లో తీసుకొంటున్నారు. ఎంపికల్లో పొరపాట్లు దొర్లకుండా సిసి కెమెరాలు కూడా వాడుతున్నారు. ఏప్రెల్ 12వ తేది వరకు ఈ ఎంపికలు జరుగుతాయి. వీటిలో ఉత్తీర్ణులైన వారికి మళ్లీ రాత పరీక్ష ఉంటుంది. ఎస్పీ రమణకుమార్ విమర్శలకు తావివ్వకుండా పకడ్బందీగా ఈ ఎంపికలు చేస్తున్నారు.

## పందాలు ఓడిన వైకాపా నేతలు!

కోవూరు ఉప ఎన్నికల్లో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి గెల్చినా పందెం కాసినంత మెజార్టీ రాకపోవడంతో ఆ పార్టీ నేతలు 400 కోట్ల రూపాయల మేర నష్టపోయారు. వీరిలో ఎక్కువ మంది ప్రొద్దుటూరు, పులివెందుల వాసులు కావడం విశేషం. నెల్లూరులోని ప్రముఖ హోటల్‌లో దిగిన వీరు ఈ పందాల తంతు కొనసాగించినా పోలీసులకు పోబిడి అందకపోవడం విశేషం.

## సితార్ వాయిద్య కచ్చేరి

నెల్లూరు తిప్పరాజు వెంకట సుబ్బయ్య సత్రంలో 31వ తేది సాయంత్రం ప్రఖ్యాత రచయిత కొడవటిగంటి కుటుంబరావు కుమారుడు డాక్టర్ కొడవటిగంటి రోహిణీప్రసాద్ సితార్ వాయిద్య కచ్చేరితోపాటు ప్రత్యేక ప్రసంగం చేస్తారు. ఈ కార్యక్రమానికి డాక్టర్ సర్వేపల్లి అజయ్‌కుమార్ అధ్యక్షత వహిస్తారు. సంగీతాభిమానులను ఈ కార్యక్రమానికి తరలి రమ్మంటున్నారు నిర్వాహకులు.

## మతాలు – మూఢ విశ్వాసాలపై చర్చావేదిక

ప్రగతిశీల ప్రజావేదిక ఏప్రెల్ 1వ తేది ఉదయం పది గంటలకు టౌన్‌హాల్ లైబ్రరీలో మతాలు – మూఢ విశ్వాసాలు అనే అంశంపై చర్చావేదిక నిర్వహిస్తుంది. బాబా అణు కేంద్రంలో భౌతిక శాస్త్రవేత్తగా పనిచేసిన డాక్టర్ కొడవటిగంటి రోహిణీప్రసాద్ ఈ సభలో ప్రసంగిస్తారు. కుట్టి విద్యా సంస్థల అధినేత, హేతువాది లతీఫ్‌కుట్టి ఈ సభకు అధ్యక్షత వహిస్తారు.

### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Online‌లో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**
స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190



## త్రాగిన మత్తులో బైకు తగులబెట్టుకొన్నాడు!



మద్యం మత్తులో ఉన్న ఓ వ్యక్తి బైక్ స్టార్ట్ కాలేదని పెట్రోల్‌పోసి నిప్పంటించిన ఘటన 26వ తేది విజయమహల్‌గేటు వద్ద జరిగింది. పూటుగా మద్యం సేవించిన ఓ యువకుడు తన బైక్‌ను స్టార్ట్ చేయగా అది స్టార్ట్ కాకపోవడంతో విసుగెత్తి ట్యాంకులో అగ్గిపుల్ల వేయడంతో ఒక్కసారిగా మంటలు వ్యాపించాయి. స్థానికులు సమాచారం అందించడంతో ఫైర్ సిబ్బంది వచ్చి మంటలు ఆర్పేశారు.

## జొన్నవాడ కామాక్షమ్మ హుండీ ఆదాయం

జొన్నవాడలో కామాక్షమ్మ దేవస్థానంలోని హుండీని 26వ తేది లెక్కించారు. 17 లక్షల 73వేల 164 రూపాయలు దీనిలో ఉండినట్లు ఇఓ వేగూరు రవీంద్రరెడ్డి చెప్పారు. మూడు మాసాల్లో హుండీ ద్వారా ఈ మొత్తం వచ్చినట్లు ఇఓ స్పష్టం చేశారు.

## ఇరుగాళమ్మ హుండీ ఆదాయం

నెల్లూరు మూలపేటలోని ఇరుగాళమ్మ దేవస్థానంలోని హుండీని 26వ తేది లెక్కించగా రెండు లక్షల 20వేల 274 రూపాయలు ఆదాయం వచ్చినట్లు ఇఓ ఎ.వి.శ్రీనివాసులురెడ్డి తెలిపారు. ఈ మొత్తం మాసం రోజులుగా హుండీలో పడినట్లు చెప్పారు.

## సాయిబాబా జన్మదిన శ్రీరామనవమి ఉత్సవాలు

నెల్లూరు గాంధీనగర్‌లోని షిర్డి సాయిబాబా మందిరంలో బాబా జన్మదిన, శ్రీరామనవమి ఉత్సవాలు ఏప్రెల్ 1వ తేది నుంచి 3వ తేది వరకు జరుగుతాయి. ప్రతిరోజు ఉదయం బాబాకు మహాన్యాసపూర్వక సామూహిక అష్టోత్తర సహస్రనామ పూజలు జరుగుతాయి. ప్రతిరోజూ షిర్డి హారతులు, సాంస్కృతిక కార్యక్రమాలుంటాయి. బాబా భక్తులను ఈ కార్యక్రమాలకు తరలి రమ్మంటున్నారు ఆలయ ఛైర్మన్ మన్నెం అమర్‌నాథ్‌రెడ్డి.

## ఆరేళ్ల తర్వాత ఇంటికి చేరిన బాలుడు

కోవూరు ఉప ఎన్నికల పుణ్యమా అని ఆరేళ్ల బాలుడు తల్లితండ్రుల వద్దకు చేరిన వైనం ఇందుకూరుపేట మండలంలో చోటుచేసుకొంది. రాజస్థాన్ రాష్ట్రం గిలుండీ గ్రామానికి చెందిన రతన్ అనే పిల్లవాడు ఇంటి నుంచి పారిపోయి వచ్చి పలు ప్రాంతాలు తిరిగి నెల్లూరు చేరుకోగా అతన్ని నిడిముసలికి చెందిన గిరిజన దంపతులు దగ్గరకు తీసి పనిలో పెట్టారు. ఇటీవల జరిగిన కోవూరు ఉప ఎన్నికలకు బందోబస్తు నిమిత్తం రాజస్థాన్ సిఆర్‌పిఎఫ్ జవానులు ఈ మండలానికి వచ్చారు. మాటల మధ్యలో రతన్ గురించి చెప్పగా వచ్చిన పోలీసులది అదే గ్రామం కావడంతో వాళ్లు ఎన్నికల తర్వాత అక్కడికి వెళ్లి సమాచారాన్ని ఆ అబ్బాయి తల్లితండ్రులకు అందించడంతో వారు వచ్చి ఆరేళ్ల క్రిందట తమకు దూరమైన పిల్లవాడిని అక్కున చేర్చుకొని స్వగ్రామానికి తీసుకొని వెళ్లారు.

## ఈత మరణాలపై దృష్టి పెట్టండి

కావలిలో పిల్లలు చెరువులోపడి

కొరవ 14వ పేజీలో

# అదుపులేని టౌన్‌బస్సులు!

▶ మద్యంమత్తులో డ్రైవర్లు - పట్టించుకోని పోలీసు



డ్రైవర్ మద్యం తాగి టౌన్‌బస్సు తోలడంతో డివైడర్ ఎక్కిన దృశ్యం.

నగరంలో తిరిగే టౌన్ బస్సులు మృత్యు శకటాల్లా మారుతున్నాయి. డ్రైవర్లు పూటుగా మద్యం సేవించి ఇష్టానుసారంగా బస్సులు నడుపుతున్నా అడిగేవారే లేకపోవడంతో నగర ప్రజలు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని తిరగాల్సి వస్తోంది. కోమిట్ల బస్ యాజమాన్యం నగరంలో వివిధ ప్రాంతాలకు బస్సులను నడుపుతోంది. అమెరికాలో ఉండే ఆ సంస్థ యాజమాన్యం బస్ సర్వీసులను ప్రయాణీకులకు సౌకర్యం కలిగేలా నడిపేందుకు శ్రీకారం చుట్టారు. సిబ్బంది ప్రయాణీకుల పట్ల మర్యాదగా ప్రవర్తించేలా సక్రమంగా నడుచుకొనేలా ఆదేశాలు జారీచేసినా రాను రాను పరిస్థితి దిగజారిపోయింది. యాజమాన్యాలు పట్టించుకోకపోవడంతో బస్సు డ్రైవర్లు మద్యం సేవించి వాటిని నడుపుతున్నారు. అయ్యప్పగుడి నుంచి ఆత్మకూరు బస్టాండ్ వరకు మద్యం మత్తులో ఎలా నడుపుతున్నారో తెలియని స్థితిలో బస్సులు వస్తుంటే ప్రజలు భయభ్రాంతులకు గురౌతున్నారు. పలు సందర్భాలలో ప్రమాదాలకు గురైనారు. గతంలో ఒక బస్సు బొల్లినేని హాస్పిటల్ వద్ద ఉన్న ఎస్‌బిహెచ్ ఎటిఎంను ఢీ కొట్టింది. అక్కడ ఉన్న ప్రయాణీకులు పరుగులు పెట్టడంతో ప్రమాదం నుంచి తప్పించుకున్నారు. ఇటీవల గాంధీబొమ్మ పెట్రోలు బంకు వద్ద ఆగి ఉన్న వాహనాలు, నిలుచున్న ప్రజలపై ఆ సంస్థ బస్ డ్రైవర్ మద్యం తాగి ఎక్కించాడు. తాజాగా మార్చి 25న ఆత్మకూరు బస్టాండ్ వద్ద డివైడర్‌ను ఢీకొట్టాడు మద్యం మత్తులో ఉన్న డ్రైవర్. బస్సు సిబ్బంది నిర్లక్ష్యంగా త్రాగి నడుపుతున్నా ఆర్‌టిఓ అధికారులుగానీ, ట్రాఫిక్ పోలీసులు పట్టించుకోకపోవడంతో వీళ్ల నగర వాసుల పట్ల యమకింకరుల్లా మారారు. కనీసం బస్సు యాజమాన్యానికి ఇన్ని ఘటనలు జరిగాక కూడా చీమకుట్టినట్లైనా లేకపోవడం పట్ల పలువురు విమర్శిస్తున్నారు.

# కోవూరు తీర్పు చారిత్రాత్మకం



విలేకరుల సమావేశంలో మాట్లాడుతున్న కాకాణి గోవర్ధన్‌రెడ్డి.

కోవూరు ఉప ఎన్నికలలో ఓటర్లు ఇచ్చిన తీర్పు చారిత్రాత్మకం అని జిల్లా పరిషత్ మాజీ ఛైర్మన్, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి తెలిపారు. రాష్ట్రవ్యాప్తంగా ప్రజలు వైఎస్ జగన్మోహన్‌రెడ్డిని ముఖ్యమంత్రిగా చూడాలనుకొంటున్నారని, దానికి నిదర్శనమే ఈ ఎన్నికలలో ప్రసన్న విజయమన్నారు. ఆయన తన నివాసంలో ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో మాట్లాడుతూ కాంగ్రెస్, తెలుగు దేశం పార్టీలు కుమ్మక్కై ఓటర్లను ప్రలోభాలకు గురిచేసినా ప్రజలు జగన్ వైపే నిలచారన్నారు. అధికార మదంతో కాంగ్రెస్ పార్టీ విచ్చలవిడిగా డబ్బు, మద్యం ప్రవహింపజేసినా, తెలుగుదేశం పార్టీ పలు హామీలిచ్చి నగదు పంచినా కోవూరు ఓటర్లు ఆ రెండు పార్టీలకు తగిన గుణపాఠం చెప్పారని, విశ్వసనీయులకు పట్టం కట్టారన్నారు. రాబోయే ఎన్నికల్లో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ విజయపరంపరకు ఈ గెలుపు నాంది అన్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి చేపట్టిన ప్రజాసంక్షేమ పథకాలు నిరాటంకంగా కొనసాగాలంటే జగన్‌కే సాధ్యం అని ప్రజలు భావిస్తున్నారని ఆ పార్టీ నేత ఎల్లసిరి గోపాలరెడ్డి తెలిపారు. తెలుగుదేశం పార్టీ దిగజారుడు ప్రకటనలు చేయడం సిగ్గుచేటని మాజీ శాసనసభ్యుడు నెలవల సుబ్రహ్మణ్యం విమర్శించారు. ఈ సమావేశంలో యువజన విభాగం నేత అనిల్‌కుమార్ యాదవ్ తదితరులు పాల్గొన్నారు.

# ట్రాఫిక్ నడత మారదా?

## ప్రతినిత్యం గందరగోళమే!



నెల్లూరు నగరంలో ఇటువంటి దృశ్యాలు ప్రతినిత్యం మామూలే.

నగరంలో ట్రాఫిక్ సమస్య నానాటికీ జటిలం అవుతుందే తప్ప పరిష్కారమార్గం కన్పడడం లేదు. పోలీస్ ఉన్నతాధికారులు పలుమార్లు ట్రాఫిక్‌ను, ముఖ్యమైన ప్రాంతాలను పరిశీలించి చర్యలకు ఉపక్రమించినా ఏమాత్రం మార్పు రావడం లేదు. ట్రాఫిక్‌ను సరిదిద్దాలన్న ఉద్దేశం డ్యూటీ చేసే పోలీసులకు, ట్రాఫిక్ నియమాలు పాటించాలన్న బాధ్యత పౌరులకు లేకపోవడంతో పరిస్థితి గందరగోళంగా తయారయ్యింది. బొల్లినేని హాస్పిటల్ నుంచి ఉత్తరం వైపుకు ప్రధాన రహదారిని సిమెంటు రోడ్డుగా నిర్మిస్తున్నారు. పోలీసులు వాహనాల రాకపోకల విషయంలో శ్రద్ధ పెట్టకపోవడంతో నిత్యం ట్రాఫిక్ సమస్య తలెత్తుతోంది. ఒకేవైపు వాహనాల రాకపోకలు సాగించాల్సి ఉన్న సమయంలో అయ్యప్పగుడి వైపు నుంచి వచ్చే వాహనాలను కొండాయపాళెం గేటు వద్దగానీ, శబరి శ్రీరామక్షేత్రం వద్దగానీ పొదలకూరురోడ్డు వైపు మళ్లించాల్సి ఉంది. గతంలో ఆ పనే చేశారు. కానీ ప్రస్తుతం ఎవరూ పట్టించుకోకపోవడంతో గంటల తరబడి వాహనాలు నిలిచిపోతున్నాయి. అంబులెన్సులు సైతం ఈ ట్రాఫిక్‌లో చిక్కుకొంటున్నాయి. ఇక పలు కూడళ్లలో ఉన్న ట్రాఫిక్ సిగ్నల్స్ వద్ద పరిస్థితి గందరగోళంగా ఉంటోంది. ఎడమ వైపుకు వెళ్లేవారు ఎలాంటి ఆటంకాలు లేకుండా వెళ్లవచ్చు. కానీ అక్కడ డ్యూటీచేసే పోలీసులకు ఫ్రీ లెఫ్ట్ అన్నది తెలియక పోవడంతో వాహనాలను నిలిపేస్తుండడంతో ఆ వైపుకు వెళ్లే వాళ్లు గ్రీన్‌సిగ్నల్ పడేంతవరకు వేచి చూడాల్సి వస్తోంది. కెవిఆర్ పెట్రోల్ బంకు వద్ద ఈ పరిస్థితి తలెత్తుతుంది. ఇక ఆనం వెంకటరెడ్డి విగ్రహం వద్ద ముత్తుకూరు వైపు వచ్చిపోయే వాహనాలు నేరుగా రాకపోకలు సాగించే అవకాశం ఉన్నా రోడ్డుకు అడ్డంగా డివైడర్లు ఏర్పాటుచేసి ఉన్నారు పోలీసులు. దీని వలన ఇటు నుంచి వెళ్లే వాహనాలు, అటు నుంచి వచ్చే వాళ్లు కొద్ది దూరం వెళ్లి తిప్పుకోవాల్సి రావడంతో వాహన చోదకులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. ఎందుకు ట్రాఫిక్ డైవర్ట్ చేస్తున్నారో అక్కడ డ్యూటీచేసే పోలీసులకు కూడా తెలియదం లేదు.

# నెల్లూరులో సరస్వతీ యాగం

● పెద్ద సంఖ్యలో పాల్గొన్న విద్యార్థులు




రాజరాజేశ్వరమ్మ గుడిలో జరిగిన సరస్వతీ యాగం.

విద్యార్థులు కష్టపడి ప్రణాళికాబద్ధంగా చదివితే అనుకొన్న లక్ష్యాన్ని చేరుకోవచ్చని జిల్లా ఎస్పీ రమణకుమార్ తెలిపారు. పదవ తరగతి పరీక్షలకు హాజరవుతున్న విద్యార్థులకు జయం కలగాలని కాంక్షిస్తూ రాష్ట్ర దేవాదాయ శాఖ, హిందూ ధార్మిక ప్రచార సమితి సంయుక్తంగా రాజరాజేశ్వరి ఆలయంలో 24వ తేది సరస్వతి యాగం చేపట్టింది. ఈ కార్యక్రమానికి ఎస్పీ రమణకుమార్ తన పిల్లలతో కలసి హాజరై యాగంలో పాల్గొన్నారు. ఆలయ ప్రధానార్చకులు రాధాకృష్ణ శర్మ, రవిశర్మల ఆధ్వర్యంలో జరిగిన యాగంలో ముందుగా గణపతి హోమం, సుబ్రహ్మణ్య హోమం, నవగ్రహ హోమం, సుందరేశ్వరస్వామి పూజ, రాజరాజేశ్వరి పూజ, సరస్వతి పూజ చేసి అనంతరం విద్యార్థులందరికీ బాసర నుంచి తెచ్చిన డాలర్లు, కంకణాలు, పుస్తకాలు, పెన్నులు పంపిణీ చేశారు. వీటిని ప్రతి విద్యార్థికి అందజేసిన ఎస్పీ మాట్లాడుతూ విద్యార్థులందరూ పరీక్షలు బాగా వ్రాయాలని కోరారు. పరీక్షల్లో ప్రణాళికాబద్ధంగా చదివితే విజయం సాధించడం సులభమన్నారు. ప్రతిఒక్కరూ ఒక లక్ష్యాన్ని నిర్దేశించుకొని ఆ దిశగా చిత్తశుద్ధితో కృషి చేయాలన్నారు. ఈ కార్యక్రమంలో ఆలయ ఇఓ శ్రీనివాసరెడ్డి, ఉభయ కర్తలు పాల్గొన్నారు.

# చరిత్రపై జాతికి స్పృహాలేదు!

చరిత్ర పరిశోధకుని ఆవేదన

చరిత్రపై జాతికి స్పృహ లేకపోవడం వల్ల ఎన్నో విలువైన విషయాలు కాలగర్భంలో కలసి పోతున్నాయని చరిత్ర పరిశోధకుడు డాక్టర్ కాళిదాసు పురుషోత్తం ఆవేదన వ్యక్తం చేశారు. సాహితీ మిత్ర మండలి నేతృత్వంలో 25వ తేది జరిగిన నందన నామ సంవత్సర ఉగాది ఉత్సవంలో పాల్గొని ప్రసంగించారు. గురజాడ అప్పారావు వ్రాసిన కన్యాశుల్కం తొలి ప్రతి భారత దేశంలో అందుబాటులో లేకపోయినా లండన్‌లో మాత్రం ఉన్నదన్నారు. గురజాడ గూర్చి విస్తృత పరిశోధనలు చేసిన ఘనత 'జమీన్‌రైతు' పూర్వ ఉప సంపాదకులు బంగోరె, గోపిలదన్నారు. తెలుగు భాషోద్యమ సమితి అధ్యక్షుడు చలంచర్ల భాస్కర్ రెడ్డి మాట్లాడుతూ బాగా వ్రాయాలంటే బాగా చదవాలన్నారు. అనంతపురం జిల్లాకు చెందిన కవి డాక్టర్ రాధేయ మాట్లాడుతూ తెలుగులో శ్రీశ్రీ, గుంటూరు శేషేంద్రశర్మ గొప్ప కవులన్నారు. అనంతరం జరిగిన కవి సమ్మేళనంలో చిన్ని నారాయణరావు, మద్దూరు శ్రీనివాసులు, అల్లూరు రహీం, మోపూరు పెంచలనరసింహం, పి.వేణుగోపాల్, ఈరుబిండి సుబ్రహ్మణ్యశాస్త్రి, ములుగు లక్ష్మీ మైథిలి, పెళ్లూరు సునీల్, సుంకర గోపాల్, కె.ఎన్.కుమార్, శానంపూడి రాఘవయ్య, ఇంద్రగంటి మధుసూదనరావు, దేవరాయపల్లి నాగార్జునాచార్యులు పాల్గొన్నారు. కార్యక్రమం విజయవంతం అయ్యేందుకు డాక్టర్ ఈదూరు సుధాకర్, ఈతకోట సుబ్బారావు శ్రమించారు.

# మృత్యుకుహరంగా మారిన కావలి పెద్ద చెరువు!

## ఎనిమిది మంది పిల్లలను బలిగొంది

కావలి పట్టణంలో ఒకే పాఠశాలలో చదువుతున్న ఎనిమిదిమంది విద్యార్థులు ఈతకు వెళ్లి పెద్ద చెరువులో పడి మృతి చెందడంతో ఆయా కుటుంబాల్లో విషాదం అలుముకొంది. పదవతరగతి చదువుతున్న వెంకటసాయికుమార్, నూరజ్, లోహిత్, సాయిభరత్, సాయిప్రవీణ్, శివకుమార్, రవికుమార్, హరీష్‌కుమార్‌లు స్నేహితులు. సరదాగా ఈత కొట్టేందుకు వెళ్లి మృత్యువాత పడ్డారు. ఈ ఘటనతో పిల్లల తల్లిదండ్రులు శోకసముద్రంలో మునిగిపోయారు. ఉజ్వల భవిష్యత్తు వున్న తమ పిల్లలు హఠాత్తుగా కానరాని లోకాలకు తరలి వెళ్లడంతో వారి కుటుంబాల్లో విషాదం అలుముకొంది. అయితే ఈ చెరువులో గత మూడేళ్లుగా ఎంతోమంది మరణించారు. గత ఏడాది బిట్రగుంట పోలీస్‌స్టేషన్‌లో పనిచేసే కానిస్టేబుల్ ఈత కొట్టేందుకు వెళ్లి మరణించాడు. అప్పుడు పోలీస్ యంత్రాంగం ఈ చెరువులో వెతికి మృతదేహాన్ని వెలికి తీసింది. ఇలాంటి ఘటనలు అనేకం జరిగి వున్నాయి. తాజాగా ఎనిమిది మంది పిల్లలు మరణించడంతో మరోసారి పెద్దచెరువు వార్తల్లోకెక్కింది. ప్రమాదకరంగా మారి పలువురి ప్రాణాలు హరిస్తున్న ఈ చెరువు చుట్టూ కంచె ఏర్పాటు చేసి హెచ్చరిక బోర్డులు ఏర్పాటు చేయాలని స్థానికులు కోరుతున్నారు. అధికారులు ఆ దిశగా చర్యలు చేపట్టినట్లయితే ఇలాంటి విషాదకర ఘటనలు జరగకుండా వుంటాయనేది పలువురి అభిప్రాయం.

# చందనాలంకారంలో చెంగాళమ్మ!

## ● ఉగాది రోజు పూజచేయించిన మాగుంట కుటుంబం



చందనాలంకారంలో చెంగాళమ్మ.

ఉగాది పండుగను పురస్కరించుకొని సూళ్లూరుపేట చెంగాళమ్మ దేవస్థానంలో ప్రత్యేక పూజలు జరిగాయి. అమ్మవారికి లక్ష కుంకుమార్చన, శ్రీమహాలక్ష్మి హోమ కార్యక్రమాలలో భక్తులు అధికసంఖ్యలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా చెంగాళమ్మకు చేసిన చందనాలంకారం భక్తులను విశేషంగా ఆకట్టుకొంది. అలాగే అమ్మవారికి స్వర్ణకిరీటాన్ని ధరింపజేశారు. ఆలయ పాలకమండలి ఛైర్మన్ ఇసనాక హర్షవర్ధన్‌రెడ్డి ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమానికి ఉభయకర్తలుగా మాగుంట పార్వతమ్మ, మాగుంట సుధాకర్‌రెడ్డి, మాగుంట శ్రీనివాసులరెడ్డి, స్నేహలత, గీతాలతలు వ్యవహరించారు. పందిళ్లపల్లి సుబ్బారెడ్డి, గీత మహాలక్ష్మీ యాగం చేయించారు. భారీగా భక్తజనం తరలి రావడంతో ఆలయం కిటకిటలాడింది.

# మింగుడు పడని ఫలితాలు

## ● కోవూరుపై మూడు పార్టీల్లో మదనం

కోవూరు ఉప ఎన్నికల ఫలితాలు ప్రధాన రాజకీయపార్టీలకు మింగుడు పడడం లేదు. ఈ ఎన్నికలను ప్రతిష్టాత్మకంగా తీసుకొని ప్రతిపక్ష తెలుగుదేశంపార్టీ, అధికార కాంగ్రెస్ పార్టీలు విజయం కోసం ఎంతో పరితపించాయి. తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి గెలిస్తే కార్యకర్తల్లో ఆత్మస్థైర్యం పెరుగుతుందని ఆశించిన పార్టీ శ్రేణులు సోమిరెడ్డి ఓటమితో డీలా పడ్డారు. ఇక కాంగ్రెస్ పార్టీ పరిస్థితి మరింత ఘోరంగా వుంది. ఆనం సోదరులు ఈ ఎన్నికలను ప్రతిష్టాత్మకంగా తీసుకొని అన్నీతామై ముందుండి నడిపించినా ప్రజలు ఆ పార్టీని మూడో స్థానంలో కూర్చోబెట్టారు. ఓటమి పాలైన అభ్యర్థులు అంతర్మథనంలో వుంటే బెట్టింగులు పెట్టి లాభాలార్జించిన వారు ఆనందంగా, పోగొట్టుకొన్న వారు నేతలను తిట్టుకొంటున్నారు. ఈ ఎన్నికల ప్రభావం త్వరలో జరగనున్న నెల్లూరు పార్లమెంటు, ఉదయగిరి నియోజకవర్గ ఎన్నికలు, పురపాలక ఎన్నికలపై ఎలా వుంటుందనే దానిపై వివిధ పార్టీ నేతలు, కార్యకర్తల్లో తీవ్రమైన చర్చ జరుగుతోంది. కావలి నియోజకవర్గంలో ఈ ఎన్నికల ప్రభావం అధికంగానే వుంది. టిడిపి గెలుస్తుందని లక్షలాది రూపాయలు బెట్టింగ్‌లు పెట్టిన పలువురు తీవ్రంగా నష్టపోయి బావురుమన్నారు.

# రైతులను ఆదుకోవాలి

మద్దతు ధర లభించక తీవ్రంగా నష్టపోతున్న జిల్లా రైతాంగాన్ని ఆదుకోవాలని కోవూరు శాసనసభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి జిల్లా కలెక్టర్ శ్రీధర్‌కు విజ్ఞప్తి చేశారు. రైతాంగ సమస్యలపై ఆయన మార్చి 22న కలెక్టర్‌ను కలసి చర్చించారు. జిల్లావ్యాప్తంగా 93 ధాన్యం కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేసినప్పటికీ రైతులకు గిట్టుబాటు ధర లభించడం లేదన్నారు. అధికారులు విధిస్తున్న షరతుల కారణంగా రైతులు తీవ్రంగా నష్టపోతున్నారన్నారు. తేమశాతం అధికంగా వుందన్న సాకుతో ధర తగ్గించి కొనుగోలు చేస్తున్నారని తెలిపారు. అధికారులు విధించే షరతులు, మిల్లర్లు, దళారులు నడుమ రైతులు తీవ్రంగా నష్టపోతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. రైతుల వద్ద నుంచి మద్దతు ధరకు ధాన్యాన్ని కొనాలని కోరారు.

# బిట్రగుంటకు మొండిచేయి!

కేంద్రప్రభుత్వం ప్రవేశపెట్టిన రైల్వేబడ్జెట్‌లో ఈసారీ బిట్రగుంట, కావలి ప్రాంతానికి మొండిచేయి ఎదురయ్యింది. ఎంతోకాలంగా ఈ ప్రాంత అభివృద్ధి సాధ్యమవుతుందని, పూర్వ వైభవం వస్తుందని ఆశించిన వారికి నిరాశే మిగిలింది. ఆసియా ఖండంలో బిట్రగుంట లోకోషెడ్ రెండవదిగా ప్రసిద్ధి. వేలాది మంది కార్మికులతో నిత్యం కళకళలాడుతుండేది. క్రమేపి బిట్రగుంట తన ప్రాభవాన్ని కోల్పోయింది. అప్పటినుంచి లోకోషెడ్డుకు ప్రత్యామ్నాయంగా ఏదో ఒక కర్మాగారంగాని, యూనిట్‌గాని నెలకొల్పమని స్థానికులు, రైల్వే కార్మికులు పలుమార్లు కోరినా, నేతలు హామీలివ్వడం తప్ప ఎన్నడూ ఆచరణకు నోచుకోలేదు. ప్రతి బడ్జెట్ సమయంలో ఈ ప్రాంత అభివృద్ధికి నిధులు ఏమైనా మంజూరు చేస్తారేమోనని ఆశగా ఎదురు చూడడం, చివరకు ఒక్కపైసా కూడా విదల్చకపోవడంతో నిరాశ చెందడం సర్వసాధారణమైంది. వస్త్రవ్యాపారంలో కావలికి సెకండ్ బాంబేగా పేరుంది. రైల్వేపరంగాను కావలి నుంచి ఆదాయం లభిస్తోంది. రైల్వేస్టేషన్ ఆధునీకరణ, సూపర్‌ఫాస్ట్ రైళ్ల నిలుపుదల తదితర అంశాలను ఈ బడ్జెట్‌లో ప్రకటిస్తారని ఎదురుచూసిన వారికి నిరాశే మిగిలింది. వివిధ పార్టీలు ఎన్నికల సమయంలో ఈప్రాంతాన్ని అభివృద్ధి పరుస్తామని, బిట్రగుంటకు పూర్వ వైభవం తీసుకొని వస్తామని హామీలిచ్చి ఓటు బ్యాంకు రాజకీయాలు చేయడం తప్ప చిత్తశుద్ధిగా కృషి చేయకపోవడంతో జిల్లాకు ప్రతి బడ్జెట్‌లో మొండిచేయి ఎదురౌతోంది.

## రైల్వే కమిటీలో ఎం.ఎం.రెడ్డి



సౌత్‌సెంట్రల్ రైల్వే యూజర్స్ కమిటి సభ్యుడిగా బోగోలు మండలం చెంచులక్ష్మీపురానికి చెందిన బొడ్డు మురళీమోహన్‌రెడ్డి నియమితులయ్యారు. రైల్వే జనరల్ మేనేజర్ సి.నీలకంఠరెడ్డి ఈమేరకు నియామకపు ఉత్తర్వులు జారీ చేశారు. మురళీమోహన్‌రెడ్డిని రైల్వే వినియోగదారుల కమిటీకి ఎంపిక చేయడం పట్ల బోగోలు మండలానికి చెందిన పలువురు హర్షం వ్యక్తం చేశారు.

# అనర్హులకు ఇందిరమ్మ ఇళ్లు! కావలిలో జరిగిందిదీ.

కావలి పట్టణంలో ఇందిరమ్మ ఇళ్లు పేదలకు గృహవసతి కల్పించడం మాట ఎలా వున్నా కౌన్సిలర్లకు మాత్రం మంచి వ్యాపారంగా మారింది. అర్హులను ప్రక్కనపెట్టి బోగస్ పేర్లతో ఎవ రికి వారు చేతివాటం ప్రదర్శించడంతో ఇళ్ల కేటాయింపు అబం దరగా మారింది. పట్టణంలోని పేద ప్రజల కోసం ముసునూరు, బుడమగుంట గ్రామాలలో విలువైన స్థలాలు కేటాయించారు. ఎంపిక నిష్పక్షపాతంగా జరిగిందని అధికారులు ప్రకటించినప్ప టికి మాజీ కౌన్సిలర్లు చెప్పినట్లు జరిగిందేతప్ప అర్హులకు దక్క లేదు. అధికారపార్టీకి చెందిన మాజీ కౌన్సిలర్లు రెవెన్యూ సిబ్బం దిపై ఒత్తిడి తెచ్చి పేర్లు వ్రాయకుండా ఖాళీ నివేశన పట్టాలు చేజిక్కించుకొన్నారు. వీటిని అమ్మకానికి పెట్టి లక్షల రూపాయలు జేబులు నింపుకొన్నట్లు సమాచారం. స్థలాల ధరలకు రెక్కలు రావడంతో వీరికి ఉ్రటవుడియంగా ఆదాయం సమకూరింది. ఈ అక్రమాలలో రెవెన్యూ, హౌసింగ్ అధికారులకు ముడుపులు అందినట్లు తెలుస్తోంది. మూడోవిడత ఇందిరమ్మ గృహాల్లో 3759 గృహాలు మంజూరుకాగా వాటిలో 1500 ఇళ్లు నిర్మాణా నికి నోచుకోలేదు. పట్టణంలో పెద్ద పెద్ద భవంతులు వున్నవారు పేదల జాబితాలో వున్నారంటే ఎంతగా అవకతవకలు జరి గాయో అర్థమవుతుంది. దీంతో ధనవంతులు స్థలం సంపా దించినప్పటికి ఇళ్లు కట్టుకోవడం లేదు. అధిక ధర వస్తే విక్రయిం చేందుకు వీలుగా ఎలాంటి నిర్మాణాలు జరపకుండా ఖాళీగా పెట్టేశారు. ప్రభుత్వం పేదలకు గృహవసతి కల్పించాలన్న ఉద్దే శంతో ప్రతిష్టాత్మకంగా చేపట్టిన ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణ పథకం బడాబాబులకు, రాజకీయ నేతలకు కాసుల పంట పండిస్తోంది.



కడపలో జరిగిన మల్లెమాల సాహిత్య పురస్కార సభలో ఎంఎస్.రెడ్డి చిత్రపటం ముందు నివాళులర్పిస్తున్న డాక్టర్ మల్లెమాల వేణుగోపాల్‌రెడ్డి, డాక్టర్ ఎన్.తులసీరెడ్డి, నిర్మాత శ్యాం ప్రసాద్‌రెడ్డి తదితరులు.

## అడంగళ్ వ్రాయడం తెలీదు!

● విఆర్వోతో ఇబ్బంది పడుతున్న జనం

తోటపల్లిగూడూరు మండలంలో కోడూరు బిట్-2 అతిపెద్ద రెవెన్యూ గ్రామం. ఇందులో కొత్త కోడూరు, నెల్లిమిట్ట కండ్రిగ, నాలుగు పట్టపుపాళాలు వున్నాయి. అత్యంత క్రమబద్ధంగా వుండాల్సిన అడంగళ్ రిజిస్టర్ పని తెలియని విఆర్ఓ వల్ల గందరగోళంగా మారింది. చనిపోయిన వారి పేర్లు అనుభవదారులుగా నమోదై వుండడం, సాగు చేస్తున్న వారి పేర్లు గల్లంతు కావడం, భూములు బదలాయించుకొన్న వారి పేర్లు ఇందులో చేర్చకపోవడం గ్రామస్తుల పాలిట శాపంగా మారింది. బ్యాంకుల లావాదేవీలకు దీనివలన ప్రతిబంధ కంగా మారిందని వాపోతున్నారు రైతులు. ఇక్కడ విఆర్ఓగా పని చేస్తున్న వ్యక్తికి కేవలం సంతకం పెట్టడం తప్ప పని తెలియపోవడంతో చిక్కులొచ్చిపడ్డాయి. ప్రస్తు తం తాత్కాలికంగా వరిగొండ విఆర్ఓకు బాధ్యతలు అప్పగించినప్పటికీ 20కి.మీ దూరం నుంచి ఆయన్ను వెతికి పట్టుకొని రావడం మరింత సమస్య అయింది. దీనిని దృష్టిలో వుంచుకొని అడంగళ్‌లో తప్పొప్పులను సరిదిద్దే అనుభవం వున్న వారిని ఇక్కడ నియమిం చాలని స్థానికులు కోరుకొంటున్నారు.

## కల్తీ సరకుల అమ్మకాలు!

### దగాపడుతున్న బోగోలు వాసులు

బోగోలు మండలంలో కల్తీ సరుకుల విక్రయాలు అధికంగా వుంటున్నాయి. తినుబండారాల దగ్గర్నుంచి ప్రతి వస్తువు కల్తీ చేసి అమ్ముతూ ప్రజల ప్రాణాలతో చెలగాటం ఆడుతున్నారు. మిర ప్పొడి, పప్పులు, నూనెలు అన్ని కల్తీమయం. మండల పరిధిలోని ప్రతి షాపులోనూ ఇలాంటి నాసిరకం, కల్తీ అయిన సరుకులే దొరుకుతుం డడంతో వాటిని తిని ప్రజలు అనారోగ్యానికి గురౌతున్నారు. ముఖ్యంగా చిన్న పిల్లలు తినే వివిధ రకాల ఆహార పదార్థాలు, మిఠాయిల్లో ఈ కల్తీ అధికంగా వుంటోంది. తక్కువ ఖర్చుతో అధిక లాభాలు వస్తుండ డంతో పిల్లల ప్రాణాలతో తమకేమి అన్నట్లు వీటిని తయారుచేసి విక్ర యించేస్తున్నా అడిగేవారే లేకుండా పోయారు. ఫుడ్ ఇన్స్‌పెక్టర్, సిబ్బంది తనిఖీలు జరిపి అలాంటి సరుకులను, ఆహార పదార్థాలు అమ్మేవారిపై చర్యలు చేపట్టాల్సి వున్నా తమకేమి సంబంధం లేనట్లు వుంటుండ డంతో కల్తీ వ్యాపారం మూడు పువ్వులు ఆరు కాయలుగా సాగుతోంది. ఇలాంటి పదార్థాలను తినడం వలన జీర్ణకోశ సంబంధిత వ్యాధులు, క్యాన్సర్ లాంటి ప్రమాదకర రోగాల బారిన పడే అవకాశం వుందని వైద్యులు హెచ్చరిస్తున్నారు. బిట్రగుంటలో ఇలాంటి కల్తీ సరుకులకు కేంద్రంగా చేసుకొని అమ్మకాలు సాగిస్తున్నట్లు సమాచారం. స్థానికులు సంబంధిత అధికారులకు సమాచారం అందిస్తే తమకు ఇలాంటి ఫిర్యాదులు ఎవరు చేయలేదని వస్తే అప్పుడు తనిఖీ చేస్తామని నిర్లక్ష్యంగా సమాధానం చెప్పడం పట్ల ఆగ్రహిస్తున్నారు ప్రజలు.

## ధర తగ్గిస్తే క్రిమినల్ కేసులు

రైతులు పండించిన ధాన్యాన్ని ప్రభుత్వం నిర్ణయించిన ధరలకే కొను గోలు చేయాలని లేకుంటే క్రిమినల్ చర్యలు చేపడతామని గూడూరు సబ్ కలెక్టర్ వీరపాండ్యన్ హెచ్చరించారు. మండల కార్యాలయంలో రైస్‌మిల్లుల యజమానులు, పౌరసరఫరాలశాఖ అధికారులతో మద్దతు ధరపై సమీక్ష నిర్వహించారు. సాధారణ రకం క్వింటాల్‌కు 1080 రూపాయలు, పుట్టి ధాన్యాన్ని 9,180 రూపాయలు, 'ఏ' గ్రేడ్ రకం ధాన్యాన్ని పుట్టి 9,435 రూపాయలుగా ప్రభుత్వం నిర్ణయించిందన్నారు. ఈ ధరలకే గ్రామాల్లో రైతుల నుంచి ధాన్యాన్ని కొనుగోలు చేయాలని రైస్ మిల్లుల యజమాన్యాలకు, దళారులను ఆదేశించారు. ఊక, తేమ శాతాన్ని చూపి ధర తగ్గించి కొనుగోలు చేస్తే ఊరుకోమని క్రిమినల్ కేసులు నమోదు చేస్తామని హెచ్చరించారు. అయితే మహా ముదురులైన దళారులు, మిల్లుల యజమానులు ప్రభుత్వ ఆదేశాలు పాటిస్తారా?

## స్మశాన స్థలం ఆక్రమణ

కాదేదీ కబ్జాలకు అనర్హం అన్నట్లు స్మశాన స్థలాన్ని సైతం ఆక్రమించి పారేయడమేగాక ఏకంగా తమ పేరుతో రిజిస్ట్రేషన్ చేయించుకొన్నారు గూడూ రులో. రెండవ పట్టణ పరిధిలో గల నెల్‌కాస్ట్ పరిశ్రమకు వెళ్లే మార్గంలో 2010-2బి, 2013-5 సర్వేనెంబర్లలో 13 ఎకరాల స్మశాన స్థలం వుంది. 1983లో కొందరు భూకబ్జాదారుల కన్ను ఈ మరుభూమిపై పడింది. వారు స్థలాన్ని ఆక్రమించేసుకొని అమ్మకాలు జరిపారు. స్థానికులు కొందరు ఈ ఆక్రమణలపై కోర్టును ఆశ్రయించగా ఆ సర్వేనెంబర్లలోని 13 ఎకరాలు స్మశాన స్థలానికి సంబంధించినవని తీర్పునిచ్చింది. తిరిగి ఇటీవల మరికొందరు కోర్టు తీర్పును ఖాతరు చేయకుండా ఈ స్థలాన్ని ఆక్రమించి అమ్మేస్తున్నారు. దీనిపై సోషల్ సర్వీస్ ఆర్గనైజేషన్ అనే స్వచ్ఛంద సంస్థ పలుమార్లు అధికారులకు ఫిర్యాదు చేసినా పట్టించుకొన్నవారే లేకుండా పోయారు. దీనికి రెవెన్యూ సిబ్బంది అండదండలుండడమే కారణమనే విమర్శలు వెల్లువెత్తుతున్నాయి.

## డబ్బులుండని ఏటిఎంలు

బ్యాంకులకు పోలేక ఏటిఎం కేంద్రాలలో నగదు డ్రా చేసుకొనేందుకు వెళ్తున్న ఖాతాదారులకు గూడూ రులో తిప్పలు తప్పడం లేదు. పట్టణంలో ఎస్‌బిఐ, ఆంధ్రాబ్యాంకు, సిండికేట్ బ్యాంకు, ఐసిఐసిఐ, ఇండి యన్ ఓవర్‌సీస్ బ్యాంకులు, వాటికి సంబంధించిన ఏటిఎం సెంటర్లు వున్నాయి. వీటిలో ఎస్‌బిఐకు మూడు, ఐసిఐసిఐకు రెండు ఏటిఎం కేంద్రాలు వున్నాయి. రద్దీగా వుండే ప్రాంతాల్లోని ఈ సెంటర్‌లలో తరచూ నగదు నిల్వలు లేకుండా పోతుండడం, మరమ్మత్తులని

### గూడూరు బ్యాంకుల ఘనతిది

బోర్డులు పెట్టి వుండడంతో సులభంగా పని జరుగు తుందని భావించి ఇక్కడకు డబ్బు డ్రా చేసుకోడానికి వచ్చే ఖాతాదారులకు మొండిచేయి ఎదురౌతోంది. సెలవు దినాల్లో అయితే వీటిలో డబ్బు వుండడం లేదు. రోజువారి నగదు నిల్వ, ఎంతంత వినియోగం అవుతుందో అవగాహన వున్న బ్యాంకు అధికారులు దానికి తగినట్లు ఏటిఎం సెంటర్లల్లో నగదు వుంచక పోతుండడంతో అత్యవసరమై ఏటిఎంలకు వచ్చే ఖాతాదారులు తీవ్ర ఇబ్బందులు పడాల్సివస్తోంది.

● కావలి

## ట్రాఫిక్ చిందర వందర

### మెరుగుపడేదెన్నడో?

పోలీసులు ఎన్ని చర్యలు చేపడుతున్నా కావలి పట్టణం ట్రాఫిక్ పరిస్థితుల్లో మార్పు లేకపోగా నానాటికి సమస్య తీవ్రత అధికం అవుతోంది. జనాభా పెరుగుదల, గ్రామీణ ప్రాంతాల ప్రజలు పట్టణానికి వలస రావడం, ఆక్రమణలు కలిసి ట్రాఫిక్ చిక్కుముడి ఏర్పడింది. దీనికి తోడు ఆటోల సంఖ్య పెరగడం, వివిధ వ్యాపారులు బండ్లు, అంగళ్లు రోడ్డుపైకి వచ్చేయడం వలన వున్న రోడ్లుకాస్తా కుచించుకపోయాయి. దీంతో కావలిలో ట్రాఫిక్ అస్తవ్య స్తంగా మారింది. పగలు రాత్రి అనే తేడా లేకుండా ట్రాఫిక్ ఎక్కడికక్కడ స్తంభించి పోతుండడంతో ప్రజలు నరకాన్ని చవి చేస్తున్నారు. డిఎస్పీ ఇందిర ట్రాఫిక్ నియంత్రణకు పలు సూచనలు చేసినా క్రిందిస్థాయి సిబ్బంది వాటిని అమలు చేయడంలో చిత్తశుద్ధిగా వ్యవహరించక పోవడంతో ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందంగా వుంది తప్ప ఏమాత్రం మెరుగుపడిన దాఖలాలు లేవు.

## భవనం ఒకటి కార్యాలయాలు మూడు

ముత్తుకూరు మండలంలో పలు ప్రభుత్వ కార్యాలయాలకు భవనాల కొరత ఏర్పడి వుంది. నిత్యం ప్రజలతో ముడిపడిన ప్రాధాన్యత గల కార్యాల యాలు, ఆస్పత్రులకు భవనాలు లేక ఇబ్బందులు ఎదురౌతున్నాయి. మండలం లోని ముసునూరువారి పాళెం పంచాయితీలో అంగన్‌వాడీ, పోస్టాఫీస్, ఆయుర్వేద ఆస్పత్రి మూడు ఒకే భవనంలో నడుస్తున్నాయి. దీంతో తీవ్ర ఇబ్బం దులు ఎదుర్కొంటున్నారు ప్రజలు. ముఖ్యంగా అంగన్‌వాడీ కేంద్రంలో పిల్లలు గదులు చాలక వరండాలో, ఆరుబయట చదువుకోవాల్సి వస్తోంది. పోస్టా ఫీసు, ఆయుర్వేద ఆస్పత్రికి వచ్చేవాళ్ల పరిస్థితి అంతే. ఒకరు లోపల వుంటే మరొకరు బయట వుండాల్సిన పరిస్థితి ఏర్పడుతోంది. ఇలాంటి వాతావరణమే యల్లూరు, కృష్ణపట్నం తదితర ప్రాంతాల్లోను ఏర్పడి వుంది. ఒక భవనంలో రెండు, మూడు కార్యాలయాలు నిర్వహించుకోవాల్సిన దుస్థితి. దీనిని దృష్టిలో వుంచుకొని అధికారులు భవనాల ఏర్పాటుచేసి ఇబ్బందులు తొలగించాలని కోరుకొంటున్నారు మండల ప్రజలు.



విక్రమ సింహపురి సంగీత సభ నెల్లూరు టౌన్‌హాల్‌లో జరిపిన ఉగాది సంబరాల్లో సమాజ సేవా రంగంలో తన వంతు సేవలందించినందుకు మురళీకృష్ణ హోటల్ అధినేత గ్రోసు గోపాలయ్యకు పురస్కారాన్ని అందిస్తున్న బివి.నరసింహం, ఎమ్మెల్యే శ్రీధరకృష్ణారెడ్డి, నిర్మల నరసింహారెడ్డి, నేతాజి పైలెట్ స్కూల్ అధినేత సుబ్బారెడ్డి, మాదరన్ స్కూల్ అధినేత వాకాటి విజయకుమార్‌రెడ్డి.

## మధ్యాహ్న భోజనం అధ్వాన్నం!

ముత్తుకూరు మండలంలో మధ్యాహ్న భోజన పథకం అధ్వాన్నంగా మారింది. నాణ్యత లేకుండా సరఫరా అవుతున్న బియ్యం వల్ల ఈ పరిస్థితి తలెత్తింది. ముక్కి, పురుగు పట్టిన బియ్యం భోజనం తయారు చేసేవారికి సరఫరా అవుతుండడంతో దానినే విద్యార్థులకు వండి వడ్డిస్తుండడంతో ఆ భోజనాన్ని తినలేక కన్నీళ్ల పర్యంతం అవుతున్నారు. మండలంలో గల 20 పంచాయితీలలో ఇలాంటి బియ్యమే సరఫరా అవుతోంది. భోజన పథకం తీరుతెన్నులను పర్యవేక్షించాల్సిన అధికారులు నామమాత్రంగా తనిఖీలు నిర్వహిస్తుండడంతో నాణ్యత కొరవడుతోంది. బియ్యంతోపాటు ఇతర అహార పదార్థాలు అధ్వాన్నంగా వుంటున్నాయి. దీంతో పిల్లలు మధ్యాహ్న భోజన పథకం క్రింద అందించే ఆహారాన్ని తినలేక పస్తులుండాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. భోజనాన్ని తయారు చేసే ఏజన్సీల నిర్వాహకులు తమకు ఇలాంటి బియ్యాన్ని అందిస్తున్నందున దానినే వండుతున్నామని దీనిలో తమ పాత్ర ఏమీ లేదని అంటున్నారు. కిలో రూపాయికి అందించే బియ్యాన్ని మధ్యాహ్న భోజన పథకానికి తరలించడమే ఈ పరిస్థితికి కారణమన్న ఆరోపణలు వినవస్తున్నాయి.

● సూళ్లూరుపేటలో

## ట్రాఫిక్ ఇక్కట్లు!

సూళ్లూరుపేట పట్టణం నడిబొడ్డున గల రైల్వేగేటు కారణంగా నిత్యం ట్రాఫిక్ సమస్యలు తలెత్తుతున్నాయి. వందలాది వాహనాలు నిలచిపోతుండడంతో ట్రాఫిక్ పద్మవ్యూహంలో గంటల తరబడి చిక్కుకొని పట్టణ ప్రజలు అల్లాడిపోతున్నారు. ఈ ప్రాంతం పంచాయితీగా వున్నప్పుడు తహశీల్దార్ కార్యాలయం ఎదురుగా రైల్వేగేటు ఏర్పాటు చేశారు. అప్పట్లో ట్రాఫిక్ చాలా తక్కువగా వుండేది. కాలక్రమంలో రైల్వేగేటుకు తూర్పువైపు పట్టణం విస్తరించడం, శ్రీహరికోట రాకెట్ కేంద్రానికి వాహనాలు వెళ్లడానికి వీలుగా కోళ్లమిట్ట ప్రాంతంలో మరో రైల్వేగేటు ఏర్పాటు చేశారు. అయినప్పటికీ ఈ గేటుగుండా వెళ్లే వాహనాల రద్దీ అధికం కావడంతో ఈ ప్రాంతంలో రైల్వే ఫ్లైఓవర్ బిడ్జి నిర్మించడంతో

### రైల్వేగేటు వద్ద ఫ్లైఓవర్ బ్రిడ్జి అవసరం

కొంతమేర ట్రాఫిక్ సమస్య తీరింది. అయితే ద్విచక్ర వాహనదారులు పలువురు పట్టణం నడిబొడ్డువున్న పాతగేటు ద్వారానే రాకపోకలు సాగిస్తుండడం, రైళ్ల రాకపోకల కారణంగా తరచూ గేటు వేస్తుండడంతో భారీసంఖ్యలో వాహనాలు నిలబడిపోతున్నాయి. ఉదయం పది గంటలలోపు, సాయంత్రం ఆరు నుంచి ఎనిమిది గంటల సమయంలో వాహనాలపై వెళ్లేవారి అవస్థ వర్ణనాతీతం. ఒక్కసారిగా గేటు తీసిన సమయంలో ఎదురెదురు వాహనాలు వచ్చి ట్రాఫిక్ తీవ్రంగా స్తంభించిపోతోంది. దీనిని దృష్టిలో వుంచుకొని రైల్వేగేటు వద్ద ట్రాఫిక్ సమస్యను చక్కదిద్దాలని స్థానికులు కోరుకొంటున్నారు.

● ఎసిబికి దొరికిన

## పశువైద్యురాలు!

సర్టిఫికేట్ ఇచ్చేందుకు లంచం తీసుకొంటూ పశువైద్యాధికారిణి ఎసిబి అధికారులకు దొరకడం ముత్తుకూరు మండలంలో సంచలనం కల్గించింది. ఇందిరారెడ్డి అనే ఆమె ఇక్కడ పశువైద్యాధికారిగా పని చేస్తోంది. పశువులకు సంబంధించిన సర్టిఫికేట్లు ఇతరత్రా రుణాల కోసం అవసరమైన పత్రాలు ఇచ్చేందుకు చేయి తడపందే సంతకం పెట్టదనే ప్రచారం వుంది. పంటపాళానికి చెందిన వడ్లమూడి కాంతమ్మ అనే మహిళ గేదెల రుణం పొందేందుకు కృష్ణపట్నం ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘంలో దరఖాస్తు చేసుకొంది. దీనికి సంబంధించి పశువైద్యశాలలో ఆరోగ్యపత్రం అవసరమై పశు వైద్యాధికారి ఇందిరను సంప్రదించగా ఐదు వేల రూపాయలు లంచం అడిగిందట. అంత ఇవ్వలేమని చెప్పినా విన్పించుకోకపోవడంతో వారు ఎసిబి అధికారులను ఆశ్రయించారు. కాంతమ్మ కుమారుడు వెంకటరమణయ్య ఎసిబి అధికారుల సూచనల మేరకు రెండు వేల రూపాయలు ఇస్తానని చెప్పడంతో ఆ మొత్తం తీసుకొని వైద్యాధికారి సర్టిఫికేట్ ఇచ్చింది. రైతు వేషంలో అక్కడ కాపుకాసి వున్న ఎసిబి డిఎస్పీ భాస్కర్‌రావు తన సిబ్బందితో దాడి చేసి డాక్టర్‌కు రసాయన పరీక్షలు నిర్వహించగా లంచం తీసుకొన్నట్లు నిర్ధారణ కావడంతో ఆమెను అరెస్టు చేశారు.

**మహిళా డాక్టర్‌లో ఇంత ఆశ బాధాకరం**

## మినీ డైరీ పథకం విఫలం!

పాడి పరిశ్రమ అభివృద్ధిలో భాగంగా రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన మినీడైరీ పథకం జిల్లాలో ఘోరంగా విఫలమయ్యింది. ఈ పథకం ద్వారా 300 యూనిట్లు అమలు చేయాలని ప్రభుత్వం లక్ష్యంగా నిర్దేశించగా ఇప్పటికి కేవలం 75 యూనిట్లు మాత్రమే జిల్లాస్థాయిలో అమలవుతోంది. ఈ పథకం క్రింద ఆసక్తిగల రైతులకు హర్యానా, తమిళనాడు ప్రాంతాల నుంచి గేదెలను అందజేసి పశు సంవర్ధకశాఖ తగిన సూచనలు సలహాలు అందించి పాడి అభివృద్ధి దోహదం చేయాలన్నదే ఉద్దేశం. ఒక్కొక్క యూనిట్‌కు లక్షాయాభై వేల రూపాయలు రైతు భరించాల్సి వుండగా, ప్రభుత్వం 50వేల రూపాయలు సబ్సీడీగా అందిస్తుంది. ఇంత మొత్తాన్ని భరించాల్సి వుండడం, అధికారుల నుంచి తగిన ప్రోత్సాహం లేకపోవడం, బ్యాంకు అధికారులు రుణ మంజూరుకు సవాలక్ష నిబంధనలు విధిస్తుండడంతో రైతులు నిరాసక్తత ప్రదర్శిస్తున్నారు. ఈ కారణాల వలన జిల్లాలో మినీడైరీ పథకం కుంటుపడుతోంది.

**అధికారులే కారణం**

## దిష్టిబొమ్మల్లా ధాన్యం కొనుగోలు కేంద్రాలు!

**కావలిలో పరిస్థితిది.**

రైతులకు మేలు చేసేందుకు ఏర్పాటు చేసిన ధాన్యం కొనుగోలు కేంద్రాలు కావలిలో వెలవెలపోతున్నాయి. అధికారులు చిత్తశుద్ధితో వ్యవహరించకపోవడం, రైతుల్లో చైతన్యం కల్గించ లేకపోవడం, కఠినమైన నిబంధనల ఫలితంగా కొనుగోలు కేంద్రాలు దిష్టిబొమ్మల్లా మారుతున్నాయి. దీంతో రైతులు చేసేదిలేక దళారుల చేతిలో దగాపడుతున్నారు. ధాన్యం ధర రోజుకొక రకంగా పడిపోతోంది. మొన్నటి వరకు సూపర్ ఫైన్ రకం పుట్టి 9వేల రూపాయలు వుండగా, ప్రస్తుతం 8వేలకు పడిపోయింది. కొనుగోలు కేంద్రాల వద్ద ధాన్యం ఆరబెట్టుకొనేందుకు డ్రయ్యర్లు ఏర్పాటు చేయకపోవడంతో రైతులు పండించిన ధాన్యాన్ని కొనుగోలు కేంద్రాల వద్దకు తీసుకొనిరాలేక, కళ్లాల వద్దే దళారులకు అమ్మేసుకొంటున్నారు. వాళ్లు తక్కువ ధరకు కొనుగోలు చేస్తున్నా విధిలేని పరిస్థితుల్లో అమ్మాల్సివస్తోందని వాపోతున్నారు. వరి సాగులో పెట్టుబడులు పెరిగినా అందుకు తగినట్లు ధాన్యం ధర పెరగడం లేదని, ఇలాగే కొనసాగితే ఇక వ్యవసాయం చేయలేని పరిస్థితి ఏర్పడుతోందని ఆందోళన చెందుతున్నారు రైతులు.

# జాతి తలరాత మార్చే విధానానికి శ్రీకారం చుట్టిన నెల్లూరీయుడు!

- **33లక్షల రూపాయల క్యాన్సర్ మందును లక్షకు దించిన పేటెంట్ చట్ట మినహాయింపు.**
- **అన్నీ విదేశీ మందులకూ ఇదే వర్తింపజేస్తే ఖరీదైన వైద్యం పేదలకందుబాటులోకి వస్తుంది.**



ఆరోగ్యం కంటే మహా భాగ్యం వేరొకటి వుండదు. అది లేకుండా ఇంకేది వున్నా అభాగ్యుల క్రిందే లెక్క. సిరిసంపదలు, రాజ్యాధికారం, భూరి భవంతులు, మందీ మార్బలం వంటివి ఎన్ని వున్నా, ఆరోగ్యం లేకుంటే ఏమి చేసుకోను? వేల కోట్ల ఆస్తిపాస్తులుండీ, రోజుకు రెండు ఇడ్లీలు కూడా తినలేని దరిద్రులెంత మందో చూస్తూనే వుంటాము. అయితే రాను రాను ఆరోగ్యం ఖరీదైన వస్తువుగా మారి పోతోంది. వైద్య చికిత్స నుంచి ప్రభుత్వాలు పక్కకు తప్పుకోవడం వల్ల జరుగుతున్న అనర్థం అది. ధర్మాసుపత్రులు జలుబు, జ్వరానికి మించి మరే రోగానికి వైద్యం చేయలేక పోతున్నాయి. గుండె, లివర్, కిడ్నీ, మెదడు వంటి కీలక అవయవాలకు రోగం సోకితే కార్పొరేట్ ఆస్పత్రులే దిక్కు. లక్షల రూపాయలు క్రుమ్మరిస్తే తప్ప అక్కడ వైద్యం దొరకదు. ఆ స్తోమత లేని వాడికి చావుకోసం ఎదురు చూడడం ఒక్కటే మార్గం. వైద్యం అనేది పేదవాడికి అందని మ్రాని పండుగా మారిపోతున్నది.

### శ్రీలంక కంటే హీనం

మన దేశంలో పుట్టే ప్రతి వెయ్యి మంది శిశువులలో 47 మంది పురిటిలోనే మరణిస్తున్నారని అంచనా. ఎంతో పేద దేశమైన శ్రీలంక కంటే ఈ విషయంలో మన చరిత్ర హీనంగా వుంది. అక్కడ శిశు మరణాల సంఖ్య వెయ్యికి 11 మాత్రమే. మన దేశంలో పుట్టిన శిశువులలో 42 శాతం మందికి పౌష్టికాహారం లేక, అనారోగ్యం సంక్రమిస్తున్నదని అంచనా. మూడేళ్ల లోపుగానే వారు ఆస్పత్రుల పాలౌతున్నారు. మరొకపక్క మద్రాసు, బెంగుళూరు, బొంబాయి, ఢిల్లీ వంటి నగరాలలో నూటికి 15 మంది పిల్లలు అధిక బరువుతో సతమతమౌతున్నారు. వీరి బాధ అవసరానికి మించిన తిండి. మధుమేహ రోగంలో మనది ప్రపంచంలోనే అగ్రస్థానం. దాదాపు 6 కోట్ల మంది షుగర్ వ్యాధిగ్రస్తులున్న దేశం మనది. తట్టు, అమ్మవారు వంటి రోగాలలోనూ మనదే మొదటి స్థానం. గుండెపోటు మరణాలలో భారతీయులదే అగ్రస్థానం. క్యాన్సర్ మహమ్మారి సంగతి చెప్పనే అవసరం లేదు. ఆ ఒక్క రోగం వల్ల ఏటా మన దేశంలో ఐదు లక్షల మందికి పైగా మరణిస్తున్నారు.

## ఉరితీయాల్సిన నేరాలు!

మన ఫార్మా కంపెనీల లాభాలు, వ్యాపారం వేల కోట్లల్లో వున్న మాట నిజం. కానీ వాటి పని తీరు చూస్తే తలదించుకోవాల్సి వుంటుంది. కొన్ని కంపెనీలు దేశ ద్రోహుల వలె వ్యవహరిస్తున్నాయి. వారు ప్రజల ఆరోగ్యం కాపాడడానికి చేసే ప్రయత్నం కంటే, వారి శరీరాలలో విషం నింపడానికి చేస్తున్న కుట్రలే అధికం. కాలుష్యం విషయంలో ఇది నిజం. హైదరాబాదులో పేరున్న పెద్ద కంపెనీలు తమ ఫ్యాక్టరీలలో మిగిలే విషపూరిత వ్యర్థాలను భూమిలోకి లోతుగా వేసిన బోరు బావులలోకి వదలి పెడుతున్నాయి. విశాఖపట్నంలోని ఒక కంపెనీ సముద్రంలోకి పొడవైన పైపు లైన్ వేసి, వ్యర్థాలన్నిటినీ అందులోకి వదలి వేస్తున్నది. మరొక విశాఖ కంపెనీ, మరింత ఘోరమైన నేరానికి పాల్పడుతున్నది. వారి దగ్గర వాటర్ ట్యాంకుల వంటి లారీలున్నాయి. వాటికి సన్నటి రంధ్రాలుంటాయి. లోపలున్న ద్రవం బొట్టు బొట్టుగా క్రింద పడే ఏర్పాటు వుంటుంది. తమ ఫ్యాక్టరీ వ్యర్థాలను ఆ లారీలలో నింపుతారు. తడ వరకు ఆ లారీని రోడ్డు మీద తిప్పుతారు. ఈ లోగా ఆ కాలుష్యమంతా రోడ్డు మీదకు జారిపోతుంది. కాలుష్య పదార్థాలను శాస్త్రీయంగా వదలించుకోవడం ఖరీదైన వ్యవహారం కావడంతో ఇటువంటి దుర్మార్గ నేరాలకు పాల్పడుతున్నాయి మన కంపెనీలు. మరొక దేశంలో అయితే వాటి యజమానులకు ఉరిశిక్ష పడుతుంది. కానీ మన పొల్యూషన్ కంట్రోల్ బోర్డు అధికారులకు లంచాల మీద వున్న మక్కువ, కాలుష్య నియంత్రణ మీద వుండదు కాబట్టి ఈ నేరాలు నిరంతరాయంగా నడిచి పోతున్నాయి.

## పేటెంట్ మందంటే ఏమిటి?

ఒక కంపెనీ లేదా శాస్త్రవేత్త ఒక కొత్త మందు కనిపెట్టినప్పుడు, దాన్ని మరొకరు కాపీ కొట్టి అమ్ముకోకుండా నిషేధం విధించడాన్ని పేటెంట్ అంటారు. మందుల అన్వేషణ ఒక నిరంతర ప్రక్రియ. ఎంత శక్తివంతమైన మందు కూడా ఎంతోకాలం పని చేయదు. ఎప్పటికప్పుడు కొత్త వాటిని కనుగొన్నప్పుడే వైద్య చికిత్స వీలౌతుంది. అయితే అదంత సులభం కాదు. ఏదో ఒక జబ్బును ఎంచుకొని, దాని చికిత్సకు తగిన మందు కోసం పరిశోధన జరపాలి. ఆ పరిశోధన సఫలం కావచ్చు, విఫలం కావచ్చు. విఫలమైతే పెట్టిన కోట్లాది రూపాయల ఖర్చు, ఏళ్ల తరబడి సమయం వృధా. సఫలం అయిన తర్వాత కూడా మార్కెట్‌లోకి విడుదల చేయడానికి ఎంతో తతంగం వుంటుంది. ముందుగా దాన్ని జంతువుల మీద ప్రయోగించాలి. దాని పని తీరు, దుష్ప్రభావాలు అంచనా వేయాలి. ఆ తర్వాత మనుషుల మీద క్లినికల్ పరీక్షలు జరపాలి. వాటిలో మందు పనితీరుతోపాటు, ఏ మోతాదులో వాడాలో నిర్ధారించుకోవాలి. ఆ తర్వాత ఆ మందును మాత్రలు, ఇంజెక్షన్లు, క్యాప్సిల్స్ వంటి రూపాలలో దేనికి తగినదో నిర్ణయించుకోవాలి. ఆ పిమ్మట శరీరంలోకి వెళ్లిన తర్వాత మందు ఎంత సేపు నిలిచి వుంది, తన పని తాను చేస్తున్నదీ అంచనా వేయాలి. అందుకు అనుగుణంగానే మాత్ర తయారు చేయాలి. ఈ తతంగమంతా నడిచిన తర్వాత ప్రభుత్వ సంస్థలకు తమ మందు తయారీకి దరఖాస్తు చేయాలి. వారికి ఈ పరీక్షలన్నీ నిజమని రుజువు చేయాలి. దాని తయారీ ప్రక్రియ నిరూపించాలి. అప్పుడు కానీ ఆ మందు అమ్మకానికి అనుమతి రాదు. ఈ మధ్యలో ఏ చిన్న తప్పు జరిగినా, వైఫల్యం ఎదురైనా మొత్తం పరిశోధన బూడిదలో పోసిన పన్నీరు క్రిందే లెక్క.

అందువల్లనే కొత్త మందు కనిపెట్టిన కంపెనీలు దాన్ని మరొకరు కాపీ కొట్టకుండా రక్షణ కోరుతాయి. ఆ భద్రత లేకుంటే కొత్తగా పరిశోధనలు చేయడానికి ఎవరూ ముందుకు రారు. దాని వల్ల వైద్య రంగం చాలా నష్టపోతుంది.

పేటెంట్ రక్షణ కాలపరిమితి సాధారణంగా 20 సంవత్సరాలు వుంటుంది. ఆ కాల పరిధిలో మరొకరు ఆ మందును ఉత్పత్తి చేయకూడదు. దాని ధర నిర్ణయం కూడా ఆయా కంపెనీల ఇష్టాఇష్టాల మీద ఆధారపడి వుంటుంది. పరిశోధనకైన ఖర్చు, భవిష్యత్తు పరిశోధనలకు పెట్టుబడి, వైఫల్యాల వల్ల కలిగే నష్టపరిహారం, లాభం వంటివన్నీ కలుపుకొని ధర నిర్ణయిస్తారు.

### దరిద్రులుగా మారుతున్న మధ్యతరగతి

ఇవన్నీ ఖరీదైన రోగాలు. వాటి చికిత్సే కాదు, మందుల ధరలు కూడా చుక్కల్లో వుంటాయి. భారత దేశంలో ఏటా నాలుగు కోట్ల మంది మధ్య తరగతి ప్రజలు కేవలం ఆస్పత్రి ఖర్చుల కారణంగా దారిద్ర్య రేఖ దిగువకు దిగజారి పోతున్నారని ఒక సర్వే నివేదిక బయటపెట్టింది. గుండె, లివర్, కిడ్నీ, మెదడు వంటి వ్యాధులు వచ్చిన కుటుంబాల ఆర్థిక పరిస్థితి తీన్నారై పోతున్నది. మనదేశంలో నూటికి 70శాతం మంది ప్రజలకు ఆరోగ్య బీమా సౌకర్యం లేదు. అప్పులు చేసి ఆస్తులు అమ్మి, తాళిబొట్లు తాకట్టు పెట్టి, ప్రాణం నిలుపుకోవడానికి మధ్య తరగతి ప్రజలు చేస్తున్న దయనీయమైన ప్రయత్నంలో వారు దరిద్రులుగా మారక తప్పడం లేదు.

### ప్రభుత్వానిదే బాధ్యత

ఈ పరిస్థితి మార్చగల్గిన శక్తి ఒక్క ప్రభుత్వానికే వుంది. ఇంగ్లాండ్ వంటి దేశాలలో వలె ప్రజలందరి ఆరోగ్య పరిరక్షణ బాధ్యత ప్రభుత్వం తీసుకోక తప్పదు. అది ఖరీదైన వ్యవహారం. లక్షల కోట్ల రుపాయలు కావాలి. బడ్జెట్ మొత్తం కూడా చాలదు. కానీ ఎక్కడో ఒక దగ్గర ప్రయత్నం మొదలుకాక తప్పదు. అందుకు రెండు కోణాలలో కృషి జరగాలి. ప్రభుత్వ ఆస్పత్రులను ప్రజల అవసరాలకు తగినట్లు అభివృద్ధి చేయడం మొదటిది. ప్రాణాధార మందుల ధరలకు ప్రజల అందుబాటులోకి తేవడం రెండవది. మొదటిది సుదీర్ఘ కాలం పట్టే ప్రక్రియ. రెండవది మాత్రం ప్రభుత్వం చేతిలో పని.

### పేటెంట్ చట్టాల అడ్డంకి

మందుల ధరలు అదుపు తప్పడానికి రెండు కారణాలు. మొదటిది పేటెంట్ చట్టం. రెండవది – స్వదేశీ ఫార్మా కంపెనీల దురాశ. విదేశీ కంపెనీలు పేటెంట్ చట్టాల రక్షణతో కొత్త రకం మందులను అలివిమాలిన ధరలకు అమ్ముతున్నాయి. స్వదేశీ కంపెనీలు జనరిక్ మందులకు కూడా దురాశతో అధిక ధరలు నిర్ణయిస్తున్నాయి. స్వదేశీ కంపెనీల నియంత్రణ ప్రభుత్వం చేతిలో పని. మందుల ధరల నియంత్రణకు చట్టబద్ధ వ్యవస్థ వుంది. కానీ ప్రభుత్వ నేతలకు చిత్తశుద్ధి లేకపోవడం, అధికారులు అవినీతిపరులు కావడంతో ఆ వ్యవస్థ నిర్వీర్యంగా వుంది. సాధారణంగా స్వదేశీ కంపెనీలు ఒక రూపాయి ఖర్చయ్యే మందును మూడు లేదా నాలుగు రూపాయలకు అమ్ముకోవడం సహేతుకం. పరిశోధన ఖర్చు, హోల్‌సేల్ రిటైల్ యంత్రాంగానికి కమిషన్, ప్రచార వ్యయం వంటి వాటికి అది అవసరం. అయితే నూటికి తొంభై శాతం మందుల ధరలు అట్లా లేవు. ఒక్క రూపాయి మందును 500 రూపాయల ధరకు

కొరవ 14వ పేజీలో

## మనదేశంలో పరిశోధన శూన్యం!

మన దేశంలో ఏటా 55వేల కోట్ల రూపాయల విలువైన మందులు అమ్ముడౌతున్నాయని అంచనా. అందుకు ఎన్నో కంపెనీలున్నాయి. సిప్లా, ర్యాన్‌బాక్సీ, లుపిన్, రెడ్డి లాబొరేటరీస్, హెటెరో డ్రగ్స్, అరబిందో, నాట్కో, ఆర్కిడ్ వంటి పెద్ద పెద్ద సంస్థలూ వున్నాయి. కానీ వాటిలో ఏ ఒక్కటీ ఒక్క కొత్త మందు కనిపెట్టిన దాఖలా లేదు. అందరు చేసేదీ కాపీ వ్యాపారమే. పరిశోధనలకు ఈ సంస్థలు పెట్టే ఖర్చు నామ మాత్రం. అది కూడా పాశ్చాత్య కంపెనీలు కని పెట్టిన కొత్త రకం మాలిక్యూల్ (సూక్ష్మ పదార్థం) లలో చిన్న చిన్న మార్పులు చేసి, వాటి తయారీకి అనుమతులు తెచ్చుకోవడం మాత్రమే. కొత్త రకం మందుల అన్వేషణ అనేది అమెరికా, ఇంగ్లాండ్, జర్మనీ, జపాన్, స్విట్జర్లాండ్ వంటి కొద్ది దేశాలలో మాత్రమే జరుగుతున్నది. వారికే పేటెంట్లు దక్కు తున్నాయి.

# శ్రీరామచంద్రుని జన్మదినం శ్రీరామనవమి



భగవంతుడు ధరించిన మానవ అవతారాలలో శ్రీరాముని అవతారం సంపూర్ణ మానవ అవతారం అని రామాయణం చెబుతోంది. భక్తుల కోర్కెలు తీర్చేందుకు, దుష్టలను సంహరించేందుకు, సజ్జనులను కష్టాల నుండి కడతేర్చేందుకు ఆయా సందర్భాలను బట్టి భగవంతుడు వివిధ అవతారాలను ఎత్తాడు. ఇతిహాసాలు, పురాణాలు, కావ్యాలు ఈ అవతారాలను గురించి తెలియజేస్తున్నాయి. శ్రీరామచంద్రమూర్తిగా అవతరించిన భగవానుడు మానవుడు ఎలా వుండాలి, ఎలా జీవించాలి, ఎలా ప్రవర్తించాలి, ఏఏ ధర్మాలను పాటించాలి అనే విషయాలను ఆచరించి చూపిన ఆదర్శమూర్తి. అందుకోసమే త్రేతాయుగంలో అవతరించినప్పటికి నేటికీ దేవునిగా కొనియాడబడుతూ, శ్రీరామనవమి పేరున నవరాత్రులు, కళ్యాణ మహోత్సవాలు జరుపుకొంటున్నారు.

త్రేతాయుగంలో రావణాసురుడు అనే రాక్షసుడు భూలోకంలో లంకాధీశుడై శివుడు, బ్రహ్మలకై ఘోరతపస్సు చేసి వారి నుంచి వరాన్ని పొంది, ఆ గర్వంతో దేవతలను, ఋషులను వేధించసాగాడు. రావణుడి బాధలు తట్టుకోలేక దేవతలు శ్రీమహావిష్ణువును శరణువేడగా ఆయన వారికి శ్రీరాముడిగా అవతరించి రావణ సంహారం చేస్తానని అభయమిస్తాడు. ఆ ప్రకారం అయోధ్యరాజైన దశరధుడు పుత్రకామేష్టి యాగం చేయగా దేవతలు సంతోషించి అగ్నిదేవుని ద్వారా దశరధునికి పాయసం పంపుతారు. దానిని తన ముగ్గురు భార్యలైన కౌసల్య, సుమిత్ర, కైకేయిలకు ఇవ్వగా కొంతకాలానికి వారు నలుగురు మగబిడ్డలకు జన్మనిచ్చారు. దేవతలకు ఇచ్చిన మాట ప్రకారం విష్ణుమూర్తి ఆదిశేషు, శంఖచక్రములు, గదలతో వారికి పుత్రులుగా జన్మిస్తారు.



చైత్రమాసం శుద్ధనవమినాడు పునర్వసు నక్షత్రంలో, ఐదు గ్రహాలు ఉచ్చంలో వుండగా కర్కాటక లగ్నాన గురువు చంద్రుడితో కలసి వుండగా జగన్నాధుడు కౌసల్యగర్భాన జన్మించాడు. ఆరోజును శ్రీరామ నవమిగా జరుపుకోవడం ఆనవాయితి. శ్రీరాముడు సీతాదేవిని వివాహమాడినది ఆనాడే. పట్టాభిషక్తుడయ్యింది కూడా నవమినాడే. అందుకే శ్రీరామనవమిని గ్రామ గ్రామాన వైభవంగా జరుపుతారు. ధర్మబద్ధ జీవనానికి నిలువెత్తు రూపం, నిదర్శనం శ్రీరాముడు. మనిషి ఎలా బ్రతకాలి, ఎలా వుండాలి, ఎలా నడుచుకోవాలో శ్రీరాముడు తెలియజెప్పాడు. అందుకే శ్రీరాముడు ఆదర్శ పురుషుడు అయ్యాడు.

ఏప్రెల్ 1తేదిన శ్రీరామనవమి సందర్భంగా..

## ట్రంకురోడ్డు కబుర్లు

### కథ మొదలయ్యింది!




మాజీమంత్రి శంకర్రావు మాటలు, ఆయన కోర్టుల్లో వేసే వాజ్యాలు ప్రత్యర్థులను హడలెత్తిస్తుంటాయి. నెల్లూరు జిల్లాలో స్మగ్లర్ల నుంచి పట్టుకొన్న ఎర్రచందనం దుంగలను తక్కువ మొత్తానికి వేలం వేశారని ఆయన హైకోర్టుకు ఎక్కారు. టన్ను 20లక్షలు విలువచేసే ఎర్రచందనాన్ని లక్ష చెప్పున అమ్మడం వెనుక నెల్లూరు అల్లుడు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి అటవీశాఖ మంత్రి విజయ రామరాజుతో చేతులు కలపడం వల్ల 500కోట్ల రూపాయల ప్రజాధనం మట్టిపాలయ్యిందని శంకర్రావుగారి ఆవేదన. ఈ కేసు ఏ మలుపు తిరుగుతుందోనన్న ఆసక్తి నెల్లూరు ప్రజలతోపాటు అటవీ శాఖాధికారుల్లో వుంది.

### బంగారు చీర



నెల్లూరు ప్రజల ఆరాధ్యదైవాలు జొన్నవాడ కామాక్షమ్మ, రాజరాజేశ్వరమ్మ, చెంగాళమ్మ. ఈకోవలోని అమ్మవారు స్టోన్‌హౌస్‌పేటలోని కన్యకాపరమేశ్వరమ్మ. ఆర్యవైశ్యుల ఆరాధ్య దేవత కావడంతో ఆ కులస్తులంతా తలా కొంత బంగారు సమర్పించి అమ్మవారికి బంగారు చీర చేయించారు. ఉగాది ముందు రోజు సంప్రోక్షణ గట్రా పూజా పునస్కారాలు చేసి పండుగరోజు ఈ చీరను అమ్మవారికి తొడిగారు. మొత్తానికి బంగారు చీరున్న అమ్మవారిగా నెల్లూరు కన్యకాపరమేశ్వరమ్మ వార్తల్లో ఎక్కారు.

### సిపిఎం పోస్టుమార్టం



కోవూరు ఉప ఎన్నికల్లో ఓటమికి కారణాలను విశ్లేషించే పనిలో పడింది సిపిఎం పార్టీ. పార్టీ గ్రామ స్థాయి కార్యదర్శులు, ముఖ్యసభ్యులు, ప్రజాశక్తి విలేకరుల అభిప్రాయాలు తెలుసుకొంది. పార్టీ కార్యకర్తలు పెద్దసంఖ్యలో వున్న నియోజకవర్గంలోనూ 3562ఓట్లు రావడం పట్ల ముందు ఒకింత ఆశ్చర్యపోయినా పోటీలో వుండిన కాంగ్రెస్, తెలుగుదేశం, వైకాపా పార్టీల అభ్యర్థులు విపరీతంగా డబ్బు పంచడం మూలంగా వెనుకబడిపోయామని ఒక అభిప్రాయానికి వచ్చిందట. ఇక్కడ పోటీకి దిగి చివరివరకు పోరాడిన కామ్రేడ్ వెంకమరాజును అందరూ అభినందించడం ఆయనలో ఓటమి బాధ కాస్త తగ్గిందని తెలిసింది.

### బిల్లుల చెల్లింపు బాధ




ఏప్రెల్ 1తేదీ నుంచి విద్యుత్ ఛార్జీలను ట్రాన్స్‌కో పెంచుతుందనే బాధలో వున్న నెల్లూరీయులకు మార్చి నెలలోనే విద్యుత్, టెలిఫోన్ బిల్లుల చెల్లింపుకు నో అంటూ ఈ-సేవా కేంద్రం ఇచ్చిన అల్టిమేటం బాధకు గురిచేస్తుంది. సర్వీసు ఛార్జీ విధింపు వ్యవహారంలో ప్రభుత్వశాఖల మధ్య ఈ గొడవ మొదలయ్యింది. ఈ ఛార్జీ చెల్లింపులకు జనం వ్యతిరేకత చూపడం లేదు. ఉదయం 9గంటల నుంచి సాయంత్రం ఏడు గంటల వరకు ఈ-సేవా కేంద్రంలో బిల్లులు కట్టించుకొంటారు. ఈ సమయం ప్రజలకు ఎంతో వెసలుబాటుగా ఉంటుంది. అదే విద్యుత్ బిల్లుల వసూలు కేంద్రంలో అయితే ఉదయం 8 గంటల నుండి ఒంటి గంట, టెలిఫోన్ ఆఫీసులో ఉదయం 9 గంట నుంచి మూడు గంటల వరకే బిల్లులు కట్టించుకొంటారు. శాఖల మధ్య కమీషన్ల లడాయి తమ ప్రాణం మీదకు వచ్చిందని జనం సణుగుతున్నా మూడు ప్రభుత్వశాఖలు ఇంకా సర్దుకోలేదు.

### సోమిరెడ్డిని కుళ్లబొడుస్తున్న సాక్షి!




కోవూరు ఉప ఎన్నికల్లో వైకాపా అభ్యర్థికి అనుకొన్నంత మెజార్టీ రాకపోవడానికి కారణం అక్కడ తెలుగుదేశం అభ్యర్థిగా పోటీ చేసిన సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి అన్నది జగమెరిగిన సత్యం. ఓటమి బాధలో వున్న సోమిరెడ్డిపై సాక్షి దినపత్రిక రోజుకొక వ్యతిరేక వార్త వ్రాసి కుళ్లబొడుస్తోంది. ఆయన ఓటముల్లో హ్యాట్రిక్ సాధించాడని ఒకరోజు వార్త వ్రాస్తే, మరోరోజు ఆయన రాజకీయ ప్రస్థానం ముగిసిపోయిందని వ్రాసింది. దీనికి తెలుగుదేశంపార్టీ ఏమి భయపడడం లేదు. సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని సాక్షి జిల్లా ఎడిషన్ మొదటిపేజీలో 'పోరాట యోధుడికి ఓటమి లేదని' ఇచ్చిన ప్రకటన ట్రంకురోడ్డులో చర్చనీయాంశమయ్యింది.

# వారఫలాలు

తేది 31-03-2012 నుండి 6-04-2012 వరకు మేషంలో గురువు; వృషభంలో శుక్ర కేతువులు; సింహంలో కుజుడు; తులలో శని; వృశ్చికంలో రాహువు; మీనంలో రవి, బుధులు; మిథున, కర్కాటక, సింహాలలో చంద్రుడు సంచరిస్తారు.



**మేషం**
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

ఈ రాశి వారికి దూరప్రాంత ప్రయాణ సూచనలున్నాయి. తల పెట్టిన పనులు పూర్తి చేయగలరు. ఇతరులతో మాట్లాడేటప్పుడు జాగ్రత్త వహించవలెను. అకారణ కోపం తగ్గించుకోవడం మంచిది. ఇంటాబయట శ్రమాధిక్యతచే అకాల భోజనం. విద్యార్థులు బాగా కష్టపడవలసి వుంటుంది. వ్యవసాయ రంగంలోని వారికి ఆదాయం సామాన్యం.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి శుభాశుభ మిశ్రమంగా వుంటుంది. ఇంట్లో జరుగు వివాహాది శుభకార్యాల గురించి బంధు మిత్రులతో చర్చించడం మంచిది. గృహనిర్మాణాది పనులు సకాలంలో పూర్తి కాగలవు. విద్యార్థులు పరీక్షలలో ఉత్తీర్ణత సాధించగలరు. వ్యవసాయ రంగంలోని వారికి తరచూ ఆటంకాలుంటాయి. రాజకీయులకు గతవారం కంటే మేలు.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

గ్రహానుకూలతల వల్ల సమాజంలో గౌరవ, ప్రతిష్టలు పెరుగుతాయి. తలపెట్టిన పనులు సకాలంలో పూర్తి చేస్తారు. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థికంగా బాగుంటుంది. విద్యార్థులకు అనుకూలంగా వుంటుంది. వ్యవసాయదారులకు గతవారం కన్నా మేలు. రాజకీయ రంగంలోని వారికి కీర్తిప్రతిష్టలు పెరుగుతాయి. ధనాదాయం బాగుండి ఉత్సాహంగా వుంటారు.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

చేసే పనులను ఆచితూచి, ఆలోచించి చెయ్యాలి. ఇతరుల సహాల వల్ల పనులకు ఆటంకాలు కలిగే అవకాశాలున్నాయి. ఆర్థికంగా సామాన్యంగా వుంటుంది. విద్యార్థులు తమ పై చదువుల గురించి జాగ్రత్తలు తీసుకోవాలి. వ్యవసాయ రంగంలోని వారికి గతంలో కన్నా కొంత మేలు. రాజకీయ నాయకులు ప్రజలతో మమేకమై నలుగురికి ఆదర్శంగా వుండాలి.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

ఈ రాశి వారు గ్రహాలు అనుకూలించడం వల్ల చేపట్టిన పనులు సకాలంలో పూర్తి చేయగలుగుతారు. అన్నింటా విజయం. స్థాన చలనం లేదా దూర ప్రయాణాలు వుంటాయి. గృహనిర్మాణ లేదా కొనుగోలు వ్యవహారాలలో చిక్కులు తొలగి పురోగతి వుంటుంది. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. వ్యవసాయ రంగంలోని వారికి సస్యానుకూలతలుంటాయి.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

దూర ప్రాంతంలోని బంధుమిత్రులను కలుసుకొంటారు. చేసే పనులలో తరచూ ఆటంకాలేర్పడతాయి. గతంలో చేసిన కొన్ని పనుల వల్ల సమస్యలేర్పడి మిమ్మల్ని ఇబ్బంది పెడతాయి. జాగ్రత్తగా వుండవలసిన సమయం. వ్యవసాయ రంగంలోని వారికి అనుకూలం. అనవసర ధన నష్టం. రాజకీయ రంగంలోని వారికి అనవసరపు చిక్కులు ఏర్పడి ప్రజలలో నమ్మకం సన్నగిల్లుతుంది.

## పంచాంగం

1తేది శ్రీరామనవమి.
2తేది శాలివాహన జయంతి.
6తేది గుడ్ ఫ్రై డే.

**శుభ ముహూర్తాలు**

5, 6తేదీలలో వివాహ, అన్నప్రాసన, దేవతా ప్రతిష్ఠ, ఉపనయన, కేశఖండనాలకు సుముహూర్తాలున్నాయి.

**మార్చి తిథులు**

**చైత్ర శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 31 | శని | అష్టమి | ప 01.41 | గం.ల.వ |

**ఏప్రెల్ తిథులు**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | ఆది | నవమి | ప 02.46 | గం.ల.వ |
| 2 | సోమ | దశమి | ప 01.39 | గం.ల.వ |
| 3 | మంగళ | ఏకాదశి | ప 12.21 | గం.ల.వ |
| 4 | బుధ | ద్వాదశి | ఉ 10.16 | గం.ల.వ |
| 5 | గురు | త్రయోదశి | ఉ 07.32 | గం.ల.వ |
| | | చతుర్దశి | తె 04.19 | గం.ల.వ |
| 6 | శుక్ర | పౌర్ణమి | రా 12.47 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, డిఎస్ఆర్ నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.



**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగ రంగాలలోని వారికి గ్రహానుకూలతలు శుభాశుభ మిశ్రమంగా వుండడం వల్ల చేసే పనులలో మిశ్రమ స్పందన వుంటుంది. పై అధికారుల భేటీ అనుకూలిస్తుంది. విద్యార్థులకు బాగుంటుంది. వ్యవసాయ రంగంలోని వారు పనులపై తగిన శ్రద్ధ తీసుకోవాలి. రాజకీయ రంగంలోని వారు ధైర్యంగా వుండి సరియైన సమయంలో కీలక నిర్ణయాలు తీసుకొంటారు.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జేష్ఠ

ఈ వారం వీరికి ఇంటా బయట శ్రమాధిక్యత వల్ల శరీర అలసట వుంటుంది. బంధుమిత్రుల కలయిక వల్ల ధన వ్యయం. ముఖ్యంగా మంచి, చెడుల విచక్షణ అవసరం. ధన నష్టం వుంటుంది. విద్యార్థులకు ఉన్నత విద్యకు ఎదురైన సమస్యలు తొలగుతాయి. వ్యవసాయ రంగంలోని వారు ఋణాలు చేయవలసి రావచ్చు. రాజకీయ రంగంలోని వారికి గతంలో ఎదురైన సమస్యలు తొలగుతాయి.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

గ్రహాల అనుకూలత వల్ల తలపెట్టిన పనులు పూర్తి చేస్తారు. శుభవార్త వింటారు. వృత్తి, వ్యాపారాలు అనుకూలించి ఆర్థిక పుష్టిని కలిగిస్తాయి. ప్రభుత్వ, కోర్టు వ్యవహారాలు అనుకూలిస్తాయి. ఉద్యోగులు తమ పై అధికారుల ప్రశంసలు పొందుతారు. విద్యార్థులకు పై చదువుల ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యవసాయదారులు ఆర్థికంగా నిలదొక్కుకొంటారు. బంధువులతో విందులు, వినోదాలు.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

ఈ రాశి వారికి శుభాశుభమిశ్రమంగా వుండి చేపట్టిన పనులు సకాలంలో పూర్తి చేస్తారు. విద్యార్థులు పరీక్షలలో విజయం సాధిస్తారు. వ్యవసాయ రంగంలోని వారికి ఆర్థిక పరిస్థితి అనుకూలిస్తుంది. ఇంట్లో ఇబ్బందికర సమస్యలు ఏర్పడతాయి. వృత్తి, వ్యాపార రంగాలలో ఎదురయ్యే సమస్యలు ఆందోళన కలిగిస్తాయి. రాజకీయ రంగంలోని వారికి ఆర్థికప్రయోజనాలున్నా ఆందోళనగా వుంటుంది.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

తరచూ ఆందోళనతో కోపం, విసుగు వల్ల చేసే పనులపై శ్రద్ధ తగ్గుతుంది. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థికంగా బాగుంటుంది. విద్యార్థుల ప్రతిభకు గుర్తింపు లభిస్తుంది. వ్యవసాయ రంగంలోని వారు కలిగిన నష్టాన్ని పూడ్చుకోగలరు. రాజకీయ రంగంలోని వారు ఒక నిర్ణయానికి కట్టుబడి వుండక కొత్త సమస్యలు తెచ్చుకొంటారు. కళా, క్రీడా రంగాలలోని వారికి బాగుంటుంది.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

అనుకున్న పనులు పూర్తి చేస్తారు. ఆర్థికంగా బాగుంటుంది. విద్యార్థులకు మంచి ప్రోత్సాహం లభిస్తుంది. వ్యవసాయానుకూలతలతో ఆదాయం పొందుతారు. రాజకీయ రంగంలోని వారు గతంలో యిచ్చిన హామీలను పూర్తి చేస్తారు. కళా, క్రీడా రంగాలలోని వారికి అనుకూలంగా వుండి, మంచి ప్రోత్సాహం లభిస్తుంది. ఆధ్యాత్మిక, కళా, సాహిత్య రంగాలలోని వారు ఉత్సాహంగా వుంటారు.

# దిక్కోణాలను బట్టి రిజిస్ట్రేషన్లు అనుకూలిస్తాయి!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఎన్.సురేఖాపాటిల్ — నెల్లూరు*

* *తూర్పు స్థలం. మా ఇద్దరిలో ఎవరి పేరున రిజిస్ట్రేషన్ చేస్తే కలిసి వస్తుంది?*

ప్లానులో 'దిక్ కోణం' బాగానే ఉంది. అంచేత మీ శ్రీవారి పేర రిజిస్ట్రేషన్ చేయించండి.

*టి.వి.ఆర్ — చెన్నై*

* *అనారోగ్యాలు, ఆర్థిక పరిస్థితులూ మన శ్శాంతి లేకుండా చేస్తున్నాయి?*

మానవ జన్మ లభించడమే కష్టం. అద్భుతమైన ఈ జన్మను అంతం చేసుకోవాలనుకోవడం అవివేకం. సమస్యకు పరిష్కారాలున్నప్పుడు ఆవేశ పూరిత నిర్ణయాలు అనర్థదాయకం. లక్ష్మీకృత వాస్తు యంత్రం ప్రతిష్టించుకోండి. శుభం జరుగుతుంది.

*వై.ప్రమీలారాణి — తిప్పసముద్రం*

* *మీరు వృక్షాన్ని తీసివేయడానికి ఒప్పుకోరు. అనివార్య కారణాల వల్ల తీసివేయవలసి వచ్చింది.*

వాస్తు శాస్త్రాలు 'వృక్ష క్షయాన్ని' అంగీకరించవు. 'నరఘోష' యంత్ర ప్రతిష్ట తక్షణం చేసుకోండి. దుష్ఫలితాలుండవు.

*ఆర్ముగం పిళ్లై — సూళ్లూరుపేట*

* *గృహంలో అవాస్తు దోషాలున్నప్పుడు ఇళ్ల దగ్గర అమ్మే యంత్రాలు తీసుకోవచ్చా?*

వైద్యుడు రోగాన్ని, మందును నిర్ధారించి నట్లు, వాస్తు శాస్త్రవేత్త వాస్తు దోషాల్ని, యంత్రాల్ని నిర్ధారిస్తాడు. స్వంత నిర్ణయాలు ఆపదలను కొని తెస్తాయి.

*సి.విలియం సుధాకర్ — కావలి*

* *చతుర్వర్ణాలకు నాలుగు నేలలున్నాయట అలాగే కట్టుకోవాలా?*

వాస్తుశాస్త్రంలో ఇదో ఛాందసం. నేలకు వర్ణాలు, కులాలు లేవు. అందువల్ల ఛాందసాల్ని పాటించాల్సిన అవసరం లేదు.

*ఎన్.భాష్యకార్లు — తిరుపతి*

* *వివాహ లగ్నాలలో అష్టమ దోషాల్ని గురించి చెప్పండి?*

జన్మ లగ్నానికి, జన్మకాల చంద్రరాశికి అష్టమలగ్నం విశేషంగా నష్టాన్ని కలిగిస్తుంది. అలా సమస్యలేవైనా ఉత్పన్నమైతే సంబంధిత రత్నధారణ చేయాలి.

*దిరేకుల లలితారాణి — నాయుడుపేట*

* *దక్షిణం ఇంటికి ఉత్తరం మెట్లు నిర్మించ వచ్చునా?*

దక్షిణ నైరుతిలో మెట్లు నిర్మించి, పైఅంతస్థు లున్న యెడల ఉత్తర వాయువ్యంలో లోహపు మెట్లు నిర్మించుకోవచ్చు.

*షేక్ నజీర్ అహ్మద్ — కర్నూలు*

* *'దిశావేధ' అంటే ఏమిటి? మా ఇంటికి దిక్కులు కోణాల్లో తగులుతున్నాయి.*

దిక్కులకు మీ గృహం తొంభై డిగ్రీలలో లేకపోవడం వల్ల ఇలా జరుగుతుంది. లే అవుట్ దోషం వల్ల కూడా కోణవేధ వస్తుంది. మీరు 'వాస్తు యంత్రం'(ఉచ్ఛ) ప్రతిష్టించుకోండి.

*వన్నెపుల వసంత — దొరవారిసత్రం*

* *వాస్తు దోషాలు కనిపించనంతగా కూడా ఉంటాయా?*

బ్రహ్మ, నాభి, కమల స్థానాల్లో దిక్ కోణాలు, దిక్ వేధలు సూక్ష్మరూపంలో ఉన్నా సరే గృహాలపై ప్రభావాలు కనిపిస్తాయి.

*కె.రమణ — ఆదోని*

* *నాది 'హస్త' నక్షత్రం, ఆవిడది జ్యేష్ఠ నక్షత్రం వివాహం కుదురుతుందా?*

మీది అగ్ని, ఆవిడది 'వాయు'తత్వం. పైకి 'విరోధం' కనిపిస్తున్నప్పటికీ ఇద్దరి రాశులూ, గ్రహస్థితి బాగున్నాయి. అందువల్ల వివాహం చేసుకోవచ్చు.

*ఎన్.భార్గవీదుర్గ — విజయవాడ*

* *నాది 'మృగశిర' నక్షత్రం, వారికి హాని చేస్తుందా?*

స్త్రీ, పురుష నక్షత్రాలు 'శిరోరజ్జువు'నందున్న భర్తకు హానిచేస్తాయని ఖచ్చితంగా చెప్పలేము. మీరు 'రత్నధారణ' కోసం జ్యోతిష శాస్త్రవేత్తను సంప్రదించండి.

# నా ఇష్టం చూడడం కష్టం!

అల్లూరు రహీం

లీడర్ ఫేం రానా ప్రత్యేక తరహా పాత్రలకు మాత్రమే సరిపోతాడు. ఆయన లవర్‌బాయ్ పాత్ర పోషించిన నేను నా రాక్షసి చిత్రం బాక్సాఫీసు వద్ద చతికిలబడింది. తాజాగా ప్రేమకథను నానా మెలికలు తిప్పి తీసిన 'నా ఇష్టం' కూడా అదే బాట పట్టింది. నా ఇష్టం చూడడం కష్టం అని చెప్పడానికి చాలా కారణాలున్నాయి. ప్రేమకథలో హీరో అంటే రొమాంటిక్‌గా ఉండాలి. ఈ చిత్రంలో రానా అలా కనపడడు. ఆయన ఎంతో కష్టపడి చేసిన డ్యాన్స్, ఫైట్స్ ప్రేక్షకులు మెచ్చలేదు. మలేషియా ఫైటర్లు పెద్ద పెద్ద రాడ్లు తీసుకొని వస్తుంటే హీరో బ్రూస్‌లీలా చేతిని అడ్డంపెట్టి అడ్డుకోవడం అతిగా తోస్తుంది. రానా చేసిన డ్యాన్సులు సైతం అందగించలేదు. క్యూట్ గర్ల్ జెనీలియా, రానాల మధ్య ఏ ఒక్క సన్నివేశంలోనూ కెమిస్ట్రీ పండలేదు. కథ, మాటలు, స్క్రీన్‌ప్లేతోపాటు దర్శకత్వ బాధ్యతలు నెరిపిన ప్రకాష్ తోలేటికి ఈ చిత్రం తీయడం చేతకాలేదు. ఏడు పాటలు, బ్రహ్మానందం, అలీతో పాటు డజన్ల కొద్ది నటులను పెట్టినా వారిచేత నటనను రాబట్టడంలో పూర్తిగా విఫలమయ్యాడు. కథ నడపడం చేతగాక మాటి మాటికి ఓ పాట, ఫైట్ పెట్టేశాడాయన. ముగ్గురు వ్యాంప్ డ్యాన్సర్లతో ఆయన తీసిన ఐటెంపాట 'బావ గార్లు పక్క ఇస్తే ఆకు ఇస్తా తెల్ల వార్లు' చరణం ఎంత గలీజుగా ఉందో చిత్రీకరణ అంత కంటే గబ్బుగా ఉంది. కుటుంబసమేతంగా చిత్రానికి వెళ్లిన వారు ఈ పాటను తెరపై చూడలేక తలలు దించుకోవాల్సిందే. చక్రి సంగీతం కూర్చిన ఏడు పాటల్లో ఓ సాధియా పాట మాత్రమే బాగుంది. మలేషియాలో చిత్రీకరించిన ఈ చిత్రంలో అక్కడి వేశ్యావాటికలను వెరైటీ కోసం చూపించిన తీరు మన సంస్కృతికి భంగం కలిగించే విధంగా ఉన్నాయి. కోన వెంకట్ వ్రాసిన ఈ కథకు దర్శకుడే వ్రాసిన మాటల్లో పరవుకన్నా ప్రాణాలు ముఖ్యం కాదు. అమ్మాయి రాజ్యసభ సీటులా ఉంది, బాగుంటే ఓజోమిన్ వాడు ప్లజర్ తగ్గుతుందనే డైలాగు అసహ్యంగా ఉంది. ఈ చిత్రం ఐటెం పాట, కొన్ని మాటలను సెన్సార్ సభ్యులు కళ్లు, చెవులు మూసుకొని చూసినట్లయింది. అయితే వెంకట ప్రసాద్ కెమెరా మలేషియా అందాలను బాగా చిత్రీకరించింది.






చిత్ర కథలోనికి వెళ్తే గణేష్(రానా) మలేషియాలో పెళ్లిళ్లకు అన్ని ఏర్పాట్లుచేసే ఈవెంట్ల నిర్వహణ సంస్థలో పనిచేస్తుంటాడు. ఆయన తండ్రి(వినోద్ కుమార్), తల్లి(కావేరి)ని వదలి వెళ్లిపోవడంతో పైసా పైసా కూడబెడుతుంటాడు. ఇక్కడి సుబ్రహ్మణ్యస్వామి దేవస్థానం వద్దకు ఇండియాలోని మండపేట నుంచి కృష్ణవేణి(జెనీలియా) హడావుడిగా వస్తుంది. తనను కిషోర్(హర్షవర్ధన్) పెళ్లి చేసుకోను రానున్నాడని ఇక్కడే మరో పెళ్లికి ఏర్పాట్లు చేస్తుండే గణేష్ మిత్ర బృందంతో చెబుతుంది. కానీ కిషోర్ రాడు. అతని కోసం దేవాలయ ప్రాంగణంలోనే ఎదురుచూస్తుండిన కృష్ణవేణిని మలేషియన్ అమ్మాయిలను తార్చే ముఠా పట్టుకెళ్లి వేశ్యా వాటికలో అమ్మేస్తారు. వీకెండ్ పార్టీలో తాగి వేశ్యలవీధిలో మిత్రులతో కలసి వెళ్తుండే గణేష్ కృష్ణవేణిని చూసి బాధపడతాడు. ఆమెను పది లక్షల రూపాయలు డబ్బిచ్చి విడిపిస్తాడు. ఉదయాన్నే తానిలా ఎందుకు చేశానని లెక్కలు వేసుకొని ఆమెను తీసుకొని స్వగ్రామం మండపేట బయలుదేరుతాడు. ఈ గ్రామంలో ప్రాణంకన్నా పరువు ప్రతిష్టలే మిన్నని బతుకుతుండే నాయుడు(నాజర్)కు ఆయన కుమార్తె కృష్ణవేణిని అప్పగిస్తాడు. మలేషియాలో జరిగినదంతా చెప్పి పది లక్షలివ్వమంటాడు. ఆమె పెళ్లి జరిగే వరకు ఉంటే 25 లక్షలిస్తానంటాడు. కృష్ణవేణినిచ్చి పెళ్లి చేయాలనుకొన్న దొరబాబు(భరత్) పరమ బేవార్సు. పెళ్లి ఏర్పాట్ల సమయంలోనే నాయుడు ఇంటికి వచ్చి అక్కడి మహిళల పట్ల చేసే వ్యాఖ్యలు విని నాయుడు భార్య(ప్రగతి) బిక్కచచ్చిపోతుంది. దీంతో ఆమె కృష్ణవేణిని గణేష్‌తో తిరిగి మలేషియా వెళ్లి మనసుపడ్డ కిషోర్‌ను పెళ్లి చేసుకోమని పాతిక లక్షలిచ్చి పంపిస్తుంది. ఇక్కడ నుంచి గణేష్ మనసు మారుతుంది. కిషోర్ కృష్ణవేణి కోసం వచ్చినా తన దగ్గర ఉందని చెప్పడు. స్వార్థంతో ఆలోచించి రకరకాల పన్నాగాలు పన్ని చివరకు ఆమె చేత ఐలవ్‌యూ చెప్పించుకొని, ప్రేమను పండించుకోను అబద్ధాలు చెప్పినా తప్పులేదని సమర్థించుకొంటాడు.



## వైవిధ్యమే స్టార్ లక్షణం

ప్రతి సినిమాలోనూ వైవిధ్యం చూపించడమే స్టార్ లక్షణమంటారు హీరో వెంకటేష్. ఈ విషయమై వివరిస్తూ కథానాయకులు ఖాళీగా ఉండకూడదు. క్లాసు, మాసు అనే బేధం లేకుండా చిత్రాల్లో నటిస్తుండాలి. ప్రేక్షకులను ఏవిధంగా మెప్పించాలి? వారికి ఎలాంటి సినిమాలు కావాలి? అనే విషయంపై పరిపూర్ణ అవగాహన కూడా ఉండాలి. ఈ యేడాది నేను మల్టీస్టారర్ చిత్రం 'సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు'లో నటిస్తున్నాను. ఉమ్మడి కుటుంబ నేపథ్యంలో ఈ కథ నడుస్తుంది. షాడో అనే మాస్ చిత్రంలోనూ నటిస్తున్నాను. మాస్ కథల్ని వినూత్నంగా తెరకెక్కించే మెహర్ రమేష్ ఈచిత్రానికి దర్శకుడు. నేను తరచూ వివేకానందుడి బోధనలు చదువుతుంటాను. వివేకానందుడి గూర్చి నేటితరం తెలుసుకోవాల్సిన అవసరం ఎంతో వుంది. ఎవరైనా ఆయన జీవిత కథ ఆధారంగా చిత్రం తీస్తే అందులో నటించను ముందుంటానంటున్నారు వెంకటేష్.

## మళ్లీ ఐశ్వర్యరాయ్



ఐశ్వర్యరాయ్ మళ్లీ మేకప్ వేసుకుంటుందా? బాలీవుడ్‌లో మళ్లీ ఎప్పటిలానే సినిమాల్లో నటిస్తుందా? అనే చర్చ విస్తృతంగా కొనసాగుతుంది. ఆమె పాప ప్రస్తుత వయస్సు నాలుగు నెలలు. ఐశ్వర్య తరపున అన్ని విషయాలను ఆమె భర్త అభిషేక్‌బచ్చన్ వివరిస్తూ ఐశ్వర్య లోకమంతా ప్రస్తుతం ఆ పసిపాపతోనే. మరో విషయం గూర్చి పట్టించుకోవడం లేదు. సినిమాల్లోకి వస్తుందా? రాదా అనేది తనే తేల్చుకోవాలి. ఈ విషయంలో ఆమెకు పూర్తి స్వేచ్ఛనిస్తున్నాను. సినిమాలంటే తనకు చాలా ఇష్టం. కానీ కొత్త బాధ్యతలొచ్చాయి. రెండింటికీ ఐష్ న్యాయం చేయగలదు. అంతా ఆమె చేతుల్లోనే వుంది. ఎందుకైనా మంచిది... దర్శకులు ఆమె కోసం కొత్త కథలు సిద్ధం చేసుకోండి అని చివర్లో హింటు కూడా ఇచ్చేశారు. అంటే అందాల ఐశ్వర్యరాయ్ అందాలను మళ్లీ తెరపై చూడొచ్చన్నమాట.

## మంచి పాత్రలు దొరికాయి



సావరియా చిత్రంతో ప్రేక్షకుల ముందుకొచ్చిన హీరోయిన్ సోనమ్‌కపూర్ బాలీవుడ్‌లో పెద్దహీరో అనిల్ కపూర్ కుమార్తె. సోనమ్ ఒకేసారి ఐదారు చిత్రాల్లో హీరోయిన్‌గా నటిస్తుంది. వీటిలో రాజ్‌కుమార్ సంతోషి, మణిరత్నం వంటి దర్శకుల చిత్రాలున్నాయి. ఇదే విషయాన్ని ఇటీవల హైదరాబాదొచ్చిన ఆమెనడిగితే ఒకేసారి ఇన్ని చిత్రాల్లో నటించడానికి ప్రత్యేక కారణమేమీలేదు. నా మనసుకు నచ్చిన కథలు కాబట్టి అంగీకరించాను. అంతేకానీ పోటీ కోసం కాదు. అయినా నేను ఎప్పుడూ ఎవర్నీ పోటీగా భావించలేదు. నాకు నేను మాత్రమే పోటీ. ఒక పాత్రను మించి మరో పాత్రని పోషించాలని తపన పడతాను. అందుకోసం ఎలాంటి కష్టమైనా పడతానంది.

## న్యాయం చేయను ప్రయత్నిస్తా!



బోణీ, తీన్‌మార్, అలా మొదలైయ్యింది, మిస్టర్ నూకయ్య చిత్రాల్లో మెరిసిన భామ కృతి కర్బంద ప్రతి సినిమాను తొలి సినిమాలా ఫీలయ్యే నటిస్తానంటుంది. తన కెరీర్ తాలుకు విషయాలను వివరిస్తూ కన్నడంలో ఇప్పుడు నాలుగు సినిమాలు చేస్తున్నాను. తెలుగులో అలా సాధ్యపడడం లేదు. ఇక్కడ కెరీర్ నిదానంగా సాగుతున్నా మంచి అవకాశాలందుకొంటున్నానన్న సంతృప్తి వుంది. నేను ఎలాంటి పాత్రలకు న్యాయం చేస్తాననే విషయం నాకన్నా దర్శకులకే బాగా తెలుసు. అందుకే నా శైలికి తగ్గ పాత్రలు నా దగ్గరికి వస్తున్నాయి. వాటికి న్యాయం చేసేందుకు శక్తి మేరకు కృషి చేస్తున్నానంది. తెలుగు తెరపై నేను కనిపించిన మొదటిరోజు నుంచీ సంతృప్తిగానే వున్నాను. అసలేం సినిమాలు లేకుండా ఖాళీగా వుండడం ఏదో ఒకటి చేయడం మంచిదంటుంది కృతి.

## తెలుగులో కార్తి



యుగానికి ఒక్కడు, ఆవారా, నాపేరు శివ, మల్లిగాడు వంటి తమిళ డబ్బింగ్ చిత్రాల ద్వారా తెలుగు ప్రేక్షకులకు దగ్గరైన హీరో కార్తి. ఆయన డైరక్ట్ తెలుగు సినిమాలో నటించాలని నిర్ణయించుకొన్నాడు. ఈ సినిమా ఎప్పుడంటే అది నా చేతుల్లో లేదు. ముందు మంచి కథ దొరకాలి. ఇదివరకు నేను నటించిన సినిమాల కంటే భిన్నంగా, ఇంకొన్ని అదనపు అంశాలు వుండాలి. ప్రయోగం జోలికి మాత్రం వెళ్లనన్నాడు. తెలుగు ప్రేక్షకులు ఉదార హృదయులని తాను నటించిన అన్ని తమిళ చిత్రాలను ఇక్కడ ఆదరించినందుకు సదా రుణపడి వుంటానన్నారు.


ఉగాది ఉత్సవాల్లో జ్యోతిప్రజ్వలన చేస్తున్న పరుచూరి వెంకటేశ్వరరావు.

## స్వర్ణభారత్‌లో ఉగాది సంబరాలు!

**సంస్కృతిని మరవవద్దన్న పరుచూరి బ్రదర్స్**

సంస్కృతీ సాంప్రదాయాలకు పెద్దపీట వేయడంలో వెంకటాచలంలో గల స్వర్ణభారత్ ట్రస్ట్ ఎప్పుడూ ముందుంటుంది. బిజెపి జాతీయ నేత ముప్పవరపు వెంకయ్యనాయుడు సారథ్యంలో నడుస్తున్న ఈ ట్రస్టులో ఎప్పటిలాగే ఈ ఏడాది ఉగాది వేడుకలు అతిథులు, ఆహుతులు, విద్యార్థుల నడుమ వేడుకగా జరిగాయి. సినీరంగంలో రచయితలుగా లబ్ధప్రతిష్టులైన పరుచూరి బ్రదర్స్, సినీ హీరో అల్లరి నరేష్‌లు ముఖ్య అతిథులుగా హాజరయ్యారు. ఈ సందర్భంగా పరుచూరి బ్రదర్స్‌గా పేరొందిన వెంకటేశ్వరరావు, గోపాలకృష్ణలు మాట్లాడుతూ పండుగలు మన సంస్కృతీ సాంప్రదాయాలకు ప్రతిబింబాలన్నారు. విదేశాలు, విదేశీ సంస్కృతుల మోజులో పడి మన దేశ సంస్కృతులను మరచి పోతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. ఉత్తమ జీవన విధానమే హిందూ మత గొప్పదనం అన్నారు. కాలాన్ని వృధా చేసుకోరాదని, దీని గురించి ఎన్టీఆర్ నుంచి ఎంతో నేర్చుకొన్నామన్నారు. విద్య, వైద్యం, రైతులు, మహిళలకు శిక్షణ తదితర రంగాల్లో స్వర్ణభారత్ ట్రస్టు చేస్తున్న కృషిని అభినందించారు. సినీ హీరో అల్లరి నరేష్ మాట్లాడుతూ నగరాల్లో పెరగడం వలన పండుగల గురించి పెద్దగా తెలియదని, ఇక్కడకు వచ్చిన తర్వాత పండుగల యొక్క గొప్పతనం తెలిసిందన్నారు. కలెక్టర్ శ్రీధర్ మాట్లాడుతూ గ్రామీణ ప్రాంతాల్లోని వారికోసం స్వర్ణభారత్ ట్రస్టు స్థాపించి వెంకయ్యనాయుడు చేస్తున్న కృషి ప్రశంసనీయం. పలువురికి ఆదర్శం అని అన్నారు. ఈ ఉగాది వేడుకలకు ముందు ట్రస్టు ఆధ్వర్యంలో నడిచే అక్షర విద్యాలయం ద్వితీయ వార్షికోత్సవం ఘనంగా జరిగింది. ప్రఖ్యాత క్రికెటర్ వివిఎస్ లక్ష్మణ్ ముఖ్య అతిథిగా హాజరై విద్యార్థులతో ముచ్చటించారు. ఈ కార్యక్రమంలో ట్రస్టీ దీపా వెంకట్, సిఇఓ శరత్‌బాబు తదితరులు పాల్గొన్నారు.

## ఎమ్మార్పీఎస్ నిరాహార దీక్షలు

ఎస్సీ వర్గీకరణ కోరుతూ గత నెల రోజులనుంచి మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి(ఎమ్మార్పీఎస్) ఆధ్వర్యంలో జిల్లా అంతటా నిరాహార దీక్షలు కొనసాగుతున్నాయి. రాష్ట్రంలో పదహారు సంవత్సరాల క్రితం ఎస్సీ వర్గీకరణ చేయాలన్న డిమాండ్‌తో ఎమ్మార్పీఎస్ ఆవిర్భవించింది. మాల, మాదిగలతోపాటు ఇతర ఎస్సీ ఉప కులాలను ఎబిసిడిలుగా విభజించాలని పలు రూపాల్లో ఆందోళన కార్యక్రమాలు జరిగాయి. అయితే ఒకే గొడుగు కిందనున్న ఎస్సీ ఉప కులాలను వర్గీకరించడం రాజ్యాంగానికి విరుద్ధమని ఇప్పటికే సుప్రీంకోర్టు ఉత్తర్వులు


నెల్లూరు ఎమ్మార్వో ఆఫీసు వద్ద దీక్షా శిబిరంలో మందాకృష్ణ మాదిగ.

ఇచ్చింది. ఈ నేపథ్యంలో పార్లమెంటులో బిల్లు ప్రవేశపెట్టి రాజ్యాంగ సవరణ చేయాలని ఎమ్మార్పీఎస్ డిమాండ్. ప్రస్తుతం జరుగుతున్న అసెంబ్లీ సమావేశాల్లో వర్గీకరణకు సంబంధించిన తీర్మానం చేసి అనంతరం పార్లమెంటులో ఆమోదం పొందే విధంగా ప్రభుత్వం కృషి చేయాలని ఒత్తిడి తెస్తున్నారు. ఇందులో భాగంగానే ఎమ్మార్పీఎస్ అధ్యక్షుడు మందా కృష్ణమాదిగ పిలుపు మేరకు రాష్ట్రవ్యాప్తంగా తహశీల్దార్ కార్యాలయాల ఎదుట నిరాహారదీక్షలు చేపట్టారు. ప్రభుత్వం స్పందించే వరకు దీక్షలు కొనసాగిస్తామని ఎమ్మార్పీఎస్ నేతలు స్పష్టం చేశారు.

బ్రోచర్‌ను విడుదలచేస్తున్న నటుడు నాగేంద్రబాబు.

## సెంటర్ సిటీలో సకల సౌకర్యాలు!

భువిధ ఇన్‌ఫ్రా వారి ప్రతిష్టాత్మక వెంచర్ సెంటర్ సిటీ బ్రోచర్‌ను ప్రముఖ సినీనటుడు నాగేంద్రబాబు 23వ తేది డిఆర్ ఉత్తమ హోటల్‌లో ఆవిష్కరించారు. అనంతరం ఆయన మాట్లాడుతూ పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతున్న నెల్లూరు నగరానికి దగ్గరలో సెంటర్ సిటీ వెంచర్‌ను ప్రారంభించడం ఆనందకరమన్నారు. అత్యాధునిక వసతులతో కూడిన ఈ వెంచర్‌ను అందుబాటు ధరల్లో ప్లాట్లను విక్రయిస్తున్న భువిధ ఇన్‌ఫ్రా ఎమ్డీ అలపాటి బాలకోటయ్యను అభినందించారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన షేక్ ఖాజావలి మాట్లాడుతూ నెల్లూరు వేగంగా విస్తరిస్తున్నందున జనం తొందరపడి ఇళ్ల స్థలాలు కొనుక్కోకుంటే భవిష్యత్తులో చింతించాల్సొస్తుందన్నారు. భువిధ గ్రూపు ఎమ్డీ బాలకోటయ్య మాట్లాడుతూ జట్లకొండూరులో తాము వేసిన సెంటర్ సిటీ వెంచర్‌లో అందుబాటు ధరలో ప్లాట్లు, కాటేజీలు, గెస్ట్‌హౌస్‌లు, ఇండోర్ స్టేడియం, క్లబ్‌హౌస్ తదితర వసతులన్నీ కల్పిస్తున్నట్లు చెప్పారు. ఈ కార్యక్రమంలో బైటస్ గ్రూపు అధినేత బాష, ముక్కాల ద్వారకానాథ్, రాధాకృష్ణారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## తాగునీటి ఎద్దడికి చర్యలు

**రంగంలో దిగిన గ్రామీణ నీటి సరఫరా విభాగం**

జిల్లాలో తాగునీటి ఎద్దడి నివారణకు గ్రామీణ నీటి సరఫరా విభాగం అధికారులు చర్యలు చేపట్టారు. పంచాయితీల వారీగా నీటి ఎద్దడి ఎదుర్కొంటున్న గ్రామాలను గుర్తించి బోర్లు, బావులకు మరమ్మత్తులు చేసే పనిలో పడ్డారు. ఇటీవల జిల్లా కలెక్టర్ తాగునీటి ఎద్దడిపై వివిధ శాఖల అధికారులతో సమీక్ష జరిపారు. రోజురోజుకు ఎండల తీవ్రత ఎక్కువవడంతో తాగునీటి సరఫరాలో ఎటువంటి ఇబ్బందులు తలెత్తకుండా ముందు జాగ్రత్తలు తీసుకోవాలని అధికారులను ఆదేశించారు. నెల్లూరు నగరం, కావలి, గూడూరు, వెంకటగిరి, సూళ్లూరుపేట మునిసిపాలిటీలతోపాటు అవసరమైన గ్రామాల్లో ట్యాంకర్లతో నీరు సరఫరా చేస్తారు. మండలస్థాయిలో తహశీల్దార్, ఎమ్‌పిడిఓలు సైతం తాగునీటి సమస్యపై దృష్టి సారిస్తారు. నిర్మాణంలో ఉన్న సమ్మర్ స్టోరేజి ట్యాంకులను త్వరితగతిన పూర్తి చేసేందుకు చర్యలు తీసుకొంటున్నట్లు అధికారులు చెబుతున్నారు. దూరప్రాంతాల నుంచి పైపులైన్ల ద్వారా నీటిని సరఫరా చేస్తున్నప్పటికీ విద్యుత్‌కోత కారణంగా సక్రమంగా గ్రామాలకు చేరడం లేదు. విద్యుత్‌కోత లేని సమయంలో తాగునీటిని సరఫరా చేసేందుకు కృషిచేయాలని వారు చెప్పారు.

## అత్యాచారం బాధితులకు పరిహారం పెంపు

అత్యాచారాలు, దాడులకు గురికాబడిన ఎస్సీ, ఎస్టీ వర్గాలకు చెందిన బాధితులకు రాష్ట్ర ప్రభుత్వం అందించే పరిహారం రెట్టింపు చేసింది. ఇప్పటివరకు అత్యాచారానికి గురైన బాధితురాలికి 50వేల రూపాయలు అందించేది ప్రభుత్వం. ఈ పరిహారాన్ని రెండు లక్షల రూపాయలకు పెంచడం జరిగింది. ఇతర వేధింపులకు గురైన వారికి కూడా నిబంధనల ప్రకారం త్వరతగతిన పరిహారం అందించాలని ఉత్తర్వులు జారీ అయ్యాయి. ఎస్సీ, ఎస్టీ అత్యాచారం నిరోధక చట్టం కింద కేసు నమోదుచేసిన తర్వాత నిర్ణీత సమయంలో బాధితులకు న్యాయం జరిగేందుకు కృషి చేయడం లేదు. కేవలం పరిహారం మాత్రం అందించి చేతులు దులుపుకుంటున్నారు అధికారులు. ఎస్సీ, ఎస్టీలపై జరిగే దాడులు, అత్యాచారాలను నియంత్రించడం మాని రాజకీయ ఒత్తిళ్ల నేపథ్యంలో ఈ చట్టం కింద కేసులు నమోదవడం విశేషం.

## చెక్కు నగదుగా మార్చుకొనే వ్యవధి ఇక మూడు నెలలు!

బ్యాంకు చెక్కులను నగదుగా మార్చుకునే కాలవ్యవధిని మూడు నెలలుగా రిజర్వు బ్యాంకు నిర్ణయించింది. ఇప్పటివరకు ఆరు నెల్లోగా చెక్కులు, డిమాండ్ డ్రాఫ్టులను నగదుగా మార్చుకొనేందుకు అవకాశం ఉండేది. రిజర్వు బ్యాంకు నూతనంగా ప్రవేశపెట్టిన ఈ విధానం ఏప్రిల్ 1 నుంచి అమల్లోకి రానుంది. మూడు నెలల వ్యవధిలోగా చెక్కులను నగదుగా మార్చుకోకుంటే అవి చెల్లుబాటు కావు. వివిధ సంస్థలు, ఇతర వ్యక్తులు జారీ చేసిన చెక్కులను ఖాతాల్లో వెంటనే జమ చేసుకోవాల్సిన అవసరం ఏర్పడింది.

## ఉపాధి హామీ సిబ్బంది సమ్మె

జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకంలో వివిధ విభాగాల్లో పనిచేస్తున్న సిబ్బంది తమ సమస్యల పరిష్కారం కోసం సమ్మె బాట పట్టారు. రాష్ట్ర కమిటీ పిలుపుమేరకు విధులకు గైర్హాజరై సమ్మెలో ఉన్నారు. మొన్నటి వరకు ఇందిర క్రాంతి పథం సిబ్బంది తమ డిమాండ్ల సాధన కోసం దాదాపు 15 రోజులకు పైగా సమ్మె చేసిన విషయం తెలిసిందే. అదేబాటలో


కలెక్టరేట్ వద్ద ఉపాధిహామీ సిబ్బంది ధర్నా.

జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం సిబ్బంది ఈనెల 24 నుంచి సమ్మె చేస్తున్నారు. సిబ్బంది సమ్మెపై గ్రామీణాభివృద్ధి శాఖ కమిషనర్ ఆగ్రహం వ్యక్తం చేస్తూ... విధులకు గైర్హాజరైన సిబ్బందికి నోటీసులు జారీ చేయాలని ఆదేశాలిచ్చారు. విధుల్లో చేరే సమయంలో కుదుర్చుకున్న ఒప్పందాలకనుగుణంగా నిబంధనలను అతిక్రమించిన వారిని విధుల నుంచి తొలగించే అధికారముందని అధికారులంటున్నారు. సమ్మెలో ఉన్న సిబ్బంది ప్రభుత్వం తమపై కక్ష సాధింపు చర్యలకు పాల్పడితే ఎదుర్కొనేందుకు సిద్ధంగా ఉన్నామని అంటున్నారు.

## ట్రెజరీకి చేరుకొన్న బిల్లులు

**● ఇక చెల్లింపు జాతర**

జిల్లాలోని ప్రభుత్వ శాఖలకు సంబంధించిన పలు రకాల బిల్లులు నగదు చెల్లింపుల కోసం ఖజానాకార్యాలయానికి చేరుకున్నాయి. మార్చి నెలాఖరుతో ఆర్థిక సంవత్సరం ముగియనుండడంతో అధిక సంఖ్యలో బిల్లులు సమర్పించారు. ప్రభుత్వ శాఖలకు అద్దె చెల్లింపు, విద్యుత్ బకాయిలు, అధికారులు వినియోగించే వాహనాలకు అద్దె, టెలిఫోన్ బిల్లులు, సిబ్బంది రవాణా భత్యం తదితర బిల్లులు ఖజానా అధికారులు పరిశీలించి మంజూరు చేయాల్సుంటుంది. ఈ బిల్లులతోపాటు ఇంజనీరింగ్ విభాగాలకు సంబంధించిన బిల్లులు కూడా ఉన్నాయి. నీటిపారుదల శాఖ, మునిసిపల్, ఆర్అండ్‌బి, పంచాయితీరాజ్ తదితర శాఖల ఆధ్వర్యంలో చేపట్టిన పనులకు బిల్లుల చెల్లింపులు జరగాలి. ప్రభుత్వం నుంచి కాంట్రాక్టర్ల బిల్లులకు ఆదేశాలున్నట్లు ఖజానా అధికారులు చెప్పారు.

● బాయిల్డ్ రైస్‌మిల్లులను

# తనిఖీ చేసిన కాలుష్య నియంత్రణ మండలి!

**జిల్లాలో వందకు పైగా బాయిల్డ్ రైసుమిల్లులున్నాయి. ఇక్కడ ఉప్పుడు బియ్యాన్ని మరిగించిన నీటిని శుభ్రపరచి కాల్వలలో వదలాలి. కానీ ఆ పని చేయకుండా వదలడం వల్ల పర్యావరణానికి ముప్పుగా పరిణమిస్తుంది.**



బాయిల్డ్ రైస్‌మిల్లులో ఆరబెట్టిన ఉడికించిన ధాన్యం.

జిల్లాలో కాలుష్యం విడుదల చేస్తున్న రైస్ మిల్లులపై కాలుష్య నియంత్రణ మండలి అధికారులు తనిఖీలు ముమ్మరం చేయనున్నారు. నిబంధనలకు విరుద్ధంగా రైసుమిల్లులను ఏర్పాటుచేసి కాలుష్యం విడుదల చేయడంతో సమీప గ్రామాల ప్రజలు అనారోగ్యం పాలవుతున్నారు. దీనిపై ప్రభుత్వానికి అనేక ఫిర్యాదులు అందడంతో స్పందించి నిబంధనలకు విరుద్దంగా నడుపుతున్న రైసు మిల్లులను తనిఖీలు చేయాలని జిల్లా కాలుష్య నియంత్రణ మండలి అధికారులకు ఆదేశాలు జారీ అయ్యాయి. దీంతో రైసుమిల్లుల జాబితా రూపొందించి తనిఖీలు చేసేందుకు రంగం సిద్ధం చేసుకుంటున్నారు.

రైతుల నుంచి ధాన్యం కొనుగోలు చేసి రైసు మిల్లులలో ఆడించి ఎగుమతి చేస్తుంటారు. పచ్చి బియ్యం మిల్లులో ఆడించే సమయంలో పెద్దగా కాలుష్యం వుండదని అంటున్నారు. ధాన్యాన్ని నీటిలో బాగా వుడకబెట్టిన తర్వాత ఆరబెట్టి మిల్లులో ఆడిస్తే ఉప్పుడు బియ్యంగా మారుతాయి. మరిగిన నీటిని మిల్లులలోనే శుద్ధి చేసి అనంతరం బయటకు వదలాలన్న నిబంధన ఉంది. అయితే రైసు మిల్లుల నిర్వాహకులు శుద్ధి చేసే ప్లాంట్‌ను ఏర్పాటు చేసుకోవడం లేదు. మరిగిన నీటిని నేరుగా బయటకు వదిలేస్తుండడంతో పారుదల కాల్వల్లోకి చేరి భరించలేని దుర్వాసన వెదజల్లుతుంటుంది.

జిల్లాలో దాదాపు వందకుపైగా బాయిల్డ్ రైస్ మిల్లులు ఏర్పాటై వున్నాయి. ఇవన్నీ కూడా కాలుష్య నియంత్రణ మండలి నుంచి ముందస్తు అనుమతి పొందాలి. వీటిని ఏర్పాటు చేసిన వారందరూ ధనికులు కావడంతో రాజకీయ నేతల నుంచి సిఫార్సు చేయించుకుని ఎటువంటి అభ్యంతరం లేకుండా అనుమతి పొందుతున్నారు. రాజకీయ నేతల నుంచి ఒత్తిడి రావడంతో సంబంధితశాఖ అధికారులు ధృవీకరణ జారీ చేసేస్తున్నారు. అనంతరం వీటి నిర్వహణపై ఎన్ని ఫిర్యాదులు అందినా పట్టించుకోవడం లేదు. నెల్లూరుకు తూర్పు వైపున సౌత్‌రాజుపాళెం గ్రామంలో అనేక బాయిల్డ్ రైసుమిల్లులు వున్నాయి.

ఈ రైస్‌మిల్లుల నుంచి విలువడే కాలుష్యం దాదాపు రెండు కిలోమీటర్ల దూరం వ్యాపించి దుర్గంధభరితమైన వాసన వస్తుంటుంది. గ్రామంలోకి వెళ్లే రహదారికి ఇరువైపుల ఇవి దర్శనమిస్తుంటాయి. ఉప్పుడు బియ్యం మిల్లులలో ఆడించే సమయంలో వెలువడే నల్లటి బూడిద గాలిలో కలసి నివాసాలపై పడుతుంటుంది. నీటిపైగానీ మూతలు వేయకుంటే వాటిని ఎటువంటి అవసరాలకు వినియోగించే అవకాశం వుండదు. భూగర్భ జలాలు కూడా ఈ మరిగించిన నీటిని కాలువల్లో వదలి వేయడం వలన కలుషితమైపోతున్నాయని గ్రామ స్తులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. కేవలం ఈ గ్రామం ఉదాహరణ మాత్రమే. ఇటువంటివి జిల్లావ్యాప్తంగా అనేకం వున్నాయి. కాలుష్య నియంత్రణ మండలి అధికారులు నిత్యం తనిఖీలు చేస్తే కొంత మెరుగుపడే అవకాశం వుంటుంది. రాష్ట్రస్థాయి అధికారుల నుంచి స్పష్టమైన ఆదేశాలు జారీ అయితేనే ఇక్కడ అధికారులు స్పందిస్తుంటారు. మిగిలిన రోజుల్లో కాలుష్యం గురించి అసలు పట్టించుకొనే పరిస్థితి వుండదు. అధికారుల తనిఖీలు ఏమేరకు ఫలితాలిస్తాయో చూడాలి.

గ్రామాల్లో పారిశుద్ధ్యం పట్టదా?

# పంచాయితీల్లో ఖర్చుకాని పారిశుద్ధ్య నిధులు!



**జిల్లాలోని 961 గ్రామ పంచాయితీల్లో పారిశుద్ధ్య పరిస్థితులు మెరుగుపర్చేందుకు విడుదలైన నిధులను ఖర్చు చేయడంలో పంచాయితీ కార్యదర్శులు పూర్తిగా విఫలమయ్యారు.**

గ్రామ పంచాయితీల పరిధిలో పారిశుద్ధ్యం మెరుగు పరచేందుకు విడుదల చేసిన నిధులు ఆర్థిక సంవత్సరం ముగిసినా ఖర్చు చేయలేని పరిస్థితి ఏర్పడింది. జిల్లాలోని 46 మండలాల్లోని 961 గ్రామ పంచాయితీలలో పారిశుద్ధ్యం మెరుగు పరచాలన్న లక్ష్యంతో జనాభాను పరిగణనలోకి తీసుకొని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు 2011–12 ఆర్థిక సంవత్సరానికి నిధులు విడుదల చేశాయి. ఈ ఆర్థిక సంవత్సరం మార్చితో ముగిసినప్పటికీ గ్రామ పంచాయితీ కార్యదర్శులు ఖర్చు చేయడంలో కృషి చేయలేక పోయారు. నిధులు మంజూరుచేసిన అధికారులు ఆ తర్వాత వీటి గురించి పట్టించుకోవడం మానేశారు.

పంచాయితీ పరిధిలోని గ్రామాల్లో చెత్తాచెదారాన్ని ఎప్పటికప్పుడు తొలగించడం, వారంలో ఒక రోజు డ్రైడేగా పాటించడం, డ్రైనేజి కాల్వలను శుభ్రం చేయడం, బ్లీచింగ్ చేయడం వంటి కార్యక్రమాలు కార్యదర్శులు చేపట్టాలి. అయితే కార్యదర్శులు పంచాయితీ కార్యాలయం, మండల పరిషత్ కార్యాలయాల చుట్టూ తిరిగేందుకే పరిమితమై పోయారు. గ్రామాల్లో పారిశుద్ధ్యం అధ్వాన్నంగా ఉన్నప్పటికీ ఏమాత్రం పట్టించుకోకుండా వదిలేస్తున్నారు. కొందరు పంచాయితీ కార్యదర్శులైతే విధులకు గైర్హాజరవుతూ సొంత పనులు చక్కబెట్టుకోవడంతో నిమగ్నమైపోయారు.

పారిశుద్ధ్యం మెరుగుకోసం అవసరమైన నిధులు ఉన్నప్పటికీ వాటిని ఖర్చు చేయడంలో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. కార్యదర్శుల పని విధానంపై పర్యవేక్షణ చేసేవారు లేకపోవడంతో ఇష్టానుసారంగా విధులకు హాజరవుతున్నారు. గ్రామ పంచాయితీలకు పాలకవర్గం గడువు ముగిసిన తర్వాత రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేకాధికారులను నియమించడం జరిగింది. ప్రత్యేకాధికారులుగా నియమితులైనవారు పంచాయితీ పరిధిలో చేపట్టాల్సిన పనులు, చేస్తున్న పనుల గురించి నిత్యం పర్యవేక్షణ చేయాలన్నది ప్రభుత్వ ఆదేశం. మండలస్థాయిలో వీరి సొంత శాఖలకు సంబంధించిన పనుల్లో నిత్యం బిజీగా ఉంటూ పంచాయితీల గురించి పట్టించుకునే సమయం దొరకడం లేదని వ్యాఖ్యానిస్తున్నారు.

ఒక్కో పంచాయితీకి పారిశుద్ధ్యం కోసం 50 వేల రూపాయల నుంచి లక్ష రూపాయల వరకు నిధులు మంజూరయ్యాయి. వీటిని ఇతర అవసరాల కోసం కార్యదర్శులు మళ్లించి పారిశుద్ధ్యం కోసం ఖర్చు చేసినట్లు లెక్కలు చూపెట్టేందుకు ప్రయత్నాలు సాగిస్తునారన్న ఆరోపణలు ఉన్నాయి. గ్రామ పంచాయితీలకు ఏ పద్దుల కింద నిధులు విడుదలవుతున్నాయన్న విషయం ప్రజలకు తెలిసే అవకాశం లేకుండా పోయింది. పాలకవర్గం ఉన్న సమయంలో సర్పంచ్, వార్డు సభ్యుల ద్వారా కొంత సమాచారం తెలిసేది. ప్రస్తుతం పంచాయితీల పరిధిలో ఏ కార్యక్రమాలు చేపడుతున్నారన్న సమాచారం తెలిపే దిక్కు లేకుండా పోయింది.

జిల్లాలో మేజర్ గ్రామ పంచాయితీలైన బుచ్చిరెడ్డిపాళెం, ముత్తుకూరు, విడవలూరు, కొడవలూరు, రాపూరు, పొదలకూరు, చేజర్ల, ఉదయగిరిలో పారిశుద్ధ్య పరిస్థితులు పరమ అధ్వాన్నంగా ఉన్నాయి. వీధులు చిమ్మేవారు, కాల్వలు ఊడ్చేవారు లేరు. దుర్గంధం, దోమల మోతతో జనం అల్లాడి పోతున్నారు. నానా రకాల వ్యాధులతో ఆస్పత్రుల పాలవుతున్నారు. ఇంత జరుగుతున్నా జిల్లా పంచాయితీ అధికారికి గ్రామాలలో పరిస్థితులు చక్కబరచాలన్న ఆలోచనే లేదు.

ఆర్థిక సంవత్సరం ముగియనుండడంతో ఖర్చు కాని నిధులు వెనక్కు వెళ్లే అవకాశం ఉంది. పంచాయితీ కార్యదర్శులు, ప్రత్యేకాధికారుల వైఖరి కారణంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల లక్ష్యం నెరవేరకుండా పోయింది.

## శ్రీకారం చుట్టిన నెల్లూరీయుడు

8వ పేజీ కొరవ

అమ్ముతున్న ఉదాహరణలు కూడా వున్నాయి. ప్రభుత్వం తలచుకొంటే ఈ దోపిడీని నివారించడం చిటికెలో పని.

కానీ పేటెంట్ మందుల పరిస్థితి అది కాదు. వాటికి అంతర్జాతీయ ఒప్పందాల పరిమితులకు లోబడి వుంటుంది. దాన్ని ఆసరాగా తీసుకొని విదేశీ కంపెనీలు దోపిడీకి పాల్పడుతున్నాయి. ఈ దుర్మార్గాన్ని నివారించడానికి ఏడేళ్ల క్రితమే చైనా తన చట్టాలను మార్చుకొన్నది. కానీ మన దేశం ఇంత వరకు ఆ ప్రయత్నం చేయలేదు.

### శ్రీనాథ్‌రెడ్డి శ్రీకారం

ప్లానింగ్ కమిషన్ ఎక్స్‌పర్ట్ గ్రూప్ ఛైర్మన్‌గా వున్న డాక్టర్ కె.శ్రీనాథ్‌రెడ్డి ఆ సత్ప్రయత్నానికి శ్రీకారం చుట్టాడు. పేటెంట్ చట్టాల పేరుతో రూపాయి మందును వెయ్యి, రెండు వేల ధరకు అమ్ముతున్న విదేశీ కంపెనీల దోపిడీకి అడ్డుకట్ట వేయడానికి సాహసించాడు. ఇందుకు పేటెంట్ చట్టంలోనే వసతి వుండడం గమనార్హం. విదేశీ కంపెనీలు తయారుచేసిన పేటెంట్ మందుల ధరలు ప్రజలకు అందుబాటులో లేకపోయినా స్థానిక పరిస్థితులకు తగిన ఫలితాలివ్వకపోయినా, కావలసినంత సరఫరా లేకపోయినా, అదే మందును స్థానికంగా తయారు చేసుకోవచ్చునన్నది ఆ చట్టంలో వున్న షరతు.

దీన్ని ఆధారం చేసుకొని చైనాతో పాటుగా థాయిలాండ్ కూడా కొన్ని పేటెంట్ మందులను తమ దేశంలో తయారు చేసుకొంటున్నది. ఎయిడ్స్, హెచ్ఐవి, గుండె జబ్బు మందులకు వారా మినహాయింపు తెచ్చుకొన్నారు. కానీ విదేశీ కంపెనీల పలుకుబడికి, ప్రలోభాలకు లోనైన మన నేతలు, అధికారులు ఇంతకాలం ఈ వసతి వున్న సంగతి దాచి పెట్టి, దోపిడీని అనుమతించారు. శ్రీనాథ్‌రెడ్డి ఆ దుర్మార్గానికి తెర దించాడు.

### మూడు లక్షల విలువైన మందు తొమ్మిది వేలకే తయారీ!

జాతి తలరాత మార్చే ఈ ప్రయత్నంలో శ్రీనాథ్‌రెడ్డి మొదటగా ఎంచుకొన్న మందు – నెక్సావార్. లివర్, కిడ్నీ క్యాన్సర్ రోగానికి శ్రేష్టమైన మందు ఇది. జర్మనీకి చెందిన బేయర్ కంపెనీ దీన్ని తయారు చేస్తున్నది. వారికి అందుకు పేటెంట్ వుంది. దానితో ఆ మందు ధరను ఒక నెలకు సరిపడా డోస్ (మోతాదు) ధర రెండు లక్షల 80వేల రూపాయలుగా నిర్ణయించారు. ఇది ఒక్కసారి వాడితే సరిపోయే మందు కాదు. ఆ రెండు రకాల క్యాన్సర్ వున్నవారు జీవితకాలం వాడాలి. అంటే ఆ రోగులు ఈ మందు కోసం ఏడాదికి 33లక్షలు ఖర్చు పెట్టాలన్న మాట. ఒక మోస్తరు ధనికులకు కూడా అలివి కాని భారం అది. దానితో అందుబాటులో మందు వుండి కూడా కొనే శక్తి లేక వేలాది మంది రోగులు మృత్యువాత పడుతున్నారు. ఈ దయనీయమైన స్థితి తొలగాలంటే, అది అందుబాటు ధరలో దొరకాలి. దాన్ని కాపీ కొట్టి, అదే ప్రభావం, అదే శక్తితో తయారు చేయడానికి హైదరాబాదుకు చెందిన నాట్కో అనే మందుల కంపెనీ ముందుకు వచ్చింది. ప్లానింగ్ కమిషన్ వున్నత స్థానం హోదాలో శ్రీనాథ్‌రెడ్డి ప్రభుత్వాన్ని ఒప్పించి, పేటెంట్ నియంత్రణ అధికారిని మెప్పించి, అందుకు అనుమతి ఇప్పించాడు. నాట్కో కంపెనీ ఇప్పుడు అదే మందును ఒక డోస్ (మోతాదు) 8వేలా 800 రూపాయలకు అమ్మడానికి సన్నాహాలు చేస్తున్నది. అంటే ఏడాదికి లక్ష రూపాయలు మాత్రమే. ఒక్కొక్క క్యాన్సర్ రోగికి ఈ ఒక్క మందు మీద 32లక్షల రూపాయలు ఆదా అవుతున్నది. ఆ ధరలో కూడా వారికి తయారీ ఖర్చు, లాభం, బేయర్ కంపెనీకి చట్ట ప్రకారం చెల్లించవలసిన రాయల్టీ వంటి వన్నీ సరిపోతున్నాయి. దాన్ని బట్టి ఇంతకాలం ఆ విదేశీ కంపెనీ ప్రజల రోగాల మీద ఎంత భారీ లాభాలు ఆర్జించిందో అర్థం చేసుకోవచ్చు.

### ఆయన మనవాడు

శ్రీనాథ్‌రెడ్డి అంటే ఎవరో కాదు. ఆయన మన వాడు. మన నెల్లూరీయుడు. గవర్నర్‌గా, కేంద్ర మంత్రిగా పని చేసిన సోషలిస్ట్ భావకుడు, ప్రజా జీవితంలో నీతి నిజాయితీలకు నమూనా వంటి వాడు, మేధావిగా ప్రపంచ ప్రశంసలందుకొన్న గొప్ప మనిషి స్వర్గీయ కె.రఘునాథరెడ్డి కుమారుడు. సంగం దగ్గరున్న విరువూరు వారి స్వగ్రామం.

శ్రీనాథ్‌రెడ్డి ప్రపంచ ప్రసిద్ధ హృద్రోగ నిపుణుడు. ఢిల్లీలోని ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌లో కార్డియాలజీ విభాగం అధిపతిగా పని చేశారు. ప్రధాని మన్మోహన్‌సింగ్‌కు రెండవసారి జరిగిన బైపాస్ సర్జరీకి నేతృత్వం వహించింది ఆయనే. ఇప్పుడాయన పబ్లిక్ హెల్త్ ఫౌండేషన్ అనే సంస్థను స్థాపించి నిర్వహిస్తున్నారు. రోగాలకు చికిత్స కంటే అవి రాకుండా నివారణ చేసుకోవడం మంచిదన్న భావాన్ని ప్రచారం చేయడం దాని లక్ష్యం. ఆయన ప్రతిభను ప్రపంచ ఆరోగ్య సంస్థ గుర్తించి, అవార్డులతో సత్కరించింది. భారత ప్రభుత్వ పద్మభూషణ్ బిరుదు ఇచ్చింది. ఎంత ఎదిగినా ఒదిగి వుండే లక్షణం శ్రీనాథ్‌రెడ్డి స్వంతం. ప్రచారం వుండదు, ఆడంబరం వుండదు. చేయవలసిన పని నిశ్శబ్దంగా చేసుకొంటూ పోతాడు. గుర్తింపు ఆశించడు. గౌరవం కోరుకోడు. అవే ఆయన కోసం ఎదురు చూస్తుంటాయి.

### ఈ ప్రయత్నం కొనసాగాలి

ప్రజల ఆరోగ్యం వారికి అందుబాటైన స్థాయికి తేవడానికి ఇది మొదలు మాత్రమే. ఈ ప్రయత్నం ఎంతోకాలం పాటు కొనసాగించవలసి వుంది. ఇతర రకాల క్యాన్సర్, గుండె జబ్బులు, ఎయిడ్స్, హెచ్ఐవి, నరాలకు సంబంధించిన సమస్యలు, లివర్ మార్పిడి వంటి ఎన్నో రోగాలకు మందులు, ఉపకరణాల ధరలు ఆకాశంలో విహరిస్తున్నాయి. ఒక్కొక్కటిగా వాటన్నిటినీ నేల మీదకు దించేందుకు బహుళజాతి సంస్థలతో సమరం చేయాలి. శ్రీనాథ్ రెడ్డి వంటి ప్రజా క్షేమం కోరే వారందరూ ఏకమైతే తప్ప సాధ్యమయ్యే పని కాదది. బహుళజాతి సంస్థలు చాలా శక్తివంతమైనవి. దేశాధిపతులనే ప్రభావితం చేయగల సమర్థత వుంటుంది వాటికి. వారిని ఢీ కొనడం, కొండతో పొట్టేలు పోటీ పడడమే. అయినా సరే, అందుకు ముందు అడుగు వేసిన శ్రీనాథ్‌రెడ్డిని మనసారా అభినందిస్తున్నాము.

## జనవాణి

2వ పేజీ కొరవ

నదా కాదా అని విచారించి తదుపరి రాయితీలు పొందుటకు అర్హత ప్రకటించాలి. అప్పుడు మాత్రమే బిపిఎల్ అర్హత కనుగొనేందుకు వీలుపడుతుంది.

ఆలూరి ఆత్మానందం నెల్లూరు

## ఉపఎన్నికలు

16వ పేజీ కొరవ

ఆ రెండు పార్టీలూ బలహీనంగా వున్నాయి కాబట్టి, గట్టిగా పని చేసి, కడపలో జగన్‌కు వచ్చినంత మెజార్టీ సాధించి చరిత్రలో నిలిచిపోవాలని రాజమోహన్‌రెడ్డి ఆశ. గెలుపుకైతే గ్యారంటీ వుంది కానీ ఈ ఆశ నెరవేరుతుందో, దురాశగా మారుతుందో మాత్రం ఇప్పుడే చెప్పలేము.

ఉదయగిరి శాసనసభ విషయం కొంత మార్పు. తెలుగుదేశం పార్టీకి ఇక్కడ బలమైన అభ్యర్థి వున్నాడు. మహారాష్ట్ర కాంట్రాక్ట్ పనులతో కుబేర అవతారమెత్తిన బొల్లినేని రామారావును ఇందు కోసం చాలాకాలం నుంచే సిద్ధం చేసి పెట్టి వున్నాడు చంద్రబాబు. నెల్లూరు లోక్‌సభ స్థానం వలె ఇక్కడ ఎన్నిక ఏకపక్షంగా వుండదని చెప్ప వచ్చు. ప్రస్తుత శాసనసభ్యుడు మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి మీద ఆయన అనుచరులలోనే తీవ్ర అసంతృప్తి వుంది. ఆగ్రహం వుంది. మరొకప్రక్క ఆయన అనుచరులు కొందరు చేసిన ఆగడాలు సాధారణ ప్రజలను బాగా బాధించి వున్నాయి. అది మేకపాటి శేఖర్‌రెడ్డికి కూడా తెలుసు. ఒకటి రెండు గ్రామాలకు వెళ్లి స్వయంగా క్షమాపణలు చెప్పాడు కూడా. ఇవన్నీ ఆయనకు అననుకూలతలు.

తెలుగుదేశం అభ్యర్థికి ఈ సమస్యలు లేవు. పైపెచ్చు పాత పాపాలు వెంటాడే ప్రమాదం లేకుండా ఆ నియోజకవర్గంలో ఇప్పటివరకు తెలుగు పెద్దలుగా వుండిన మాదాల జానకిరాం, కంభం విజయరామిరెడ్డి కాంగ్రెస్‌లో చేరిపోయారు. వారి పాపభారం కూడా ఆ పార్టీకి బదలీ అయిపోయింది. మరొకప్రక్క వెనుకబడిన తరగతులకు చెందిన ప్రజలు అధికంగా వుండే నియోజకవర్గం ఇది. కోవూరు ఉప ఎన్నికలలోనే బిసిల మొగ్గు టిడిపి వైపు అని సూచాయగా నిరూపణ అయ్యింది. దాని వల్లనే ఆ పార్టీకి అక్కడ 50వేల ఓట్లు వచ్చాయి. బిసిలలో వున్న ఈ సానుకూలతను సద్వినియోగం చేసుకోగల్గితే ఉదయగిరిలో తెలుగుదేశం పార్టీ కీలక స్థానానికి చేరుకొంటుంది. గెలుపుకు దగ్గరగా వుంటుంది. ఆ ఆశతోనే బొల్లినేని రామారావు ఉత్సాహంగా కన్పిస్తున్నాడు.

కాంగ్రెస్‌కు అభ్యర్థి కొరత వుంది. మాదాల జానకిరాం నేను పోటీ చేయను కాక చేయనంటున్నాడు. ఇరవై కోట్ల ఎన్నికల ఖర్చు పెట్టుకొనే స్థోమత నాకు లేదన్నది ఆయన ఆంతర్యం. కంభం విజయ రామిరెడ్డి పాత పడిపోయాడు. ఆయనలో కొత్తగా ఓటర్లను ఆకర్షించే ఎత్తులు జిత్తులు ఏవీ మిగిలి లేవు. పైపెచ్చు గత ఎన్నికల తర్వాత ఆయన కుటుంబ సభ్యులంతా కట్టకట్టుకొని మేకపాటి సోదరుల వద్దకు వెళ్లి మీకు అణిగిమణిగి వుంటాము, మమ్మల్ని వేధించవద్దని మొరపెట్టుకొన్నారట. దానితో వారి అనుచరవర్గమంతా తలా ఒక దిక్కు తరలిపోయింది. జిల్లా పరిషత్ మాజీ ఛైర్మన్ చెంచలబాబు యాదవ్ నేను బిసిని, పైగా మా నాయన ఎమ్మెల్యేగా చేసిన నియోజకవర్గం కాబట్టి నాకే టిక్కెట్ ఇవ్వాలని కోరుతున్నాడు. చెంచల బాబుకు పొయ్యేది ఏమీ లేదు. కొండకు వెంట్రుక కట్టి లాగితే, వస్తే కొండ, పోతే వెంట్రుక. అంతే.

మొత్తం మీద ఉదయగిరిలో తమ పార్టీకి అభ్యర్థిని వెతికి పట్టుకోవడం జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డికి పెద్ద తలపోటు వ్యవహారం.

## వైఎస్సే గుర్తుకు వస్తున్నాడు

మొదటి పేజీ కొరవ

దం సాధ్యం. కానీ ఇప్పుడెవరికి ఉంది ఆ నేర్పరితనం? తెలంగాణ మంటలు మళ్లీ వ్యాపిస్తే రాష్ట్రం పరిస్థితి ఏమిటి? ఇప్పటికే సిబిఐ, ఎసిబి కేసుల పరంపరతో, హైకోర్టు వాజ్యాలతో హైదరాబాదులో పారిశ్రామిక, వ్యాపార అభివృద్ధి మందగించి పోయింది. తెలంగాణ ఉద్యమం మరొకసారి ఉధృతమైతే రాష్ట్రం పాతిక ముప్పై ఏళ్ల వెనక్కు జారిపోవడం ఖాయం.

శాసనసభ సమావేశాలు జరిగిన తీరే అందుకు ఉదాహరణ. బడ్జెట్ సమావేశాలని పేరే తప్ప అందులో బడ్జెట్ గురించి కానీ, పద్దుల మీద కానీ కనీసపాటి చర్చ జరగలేదు. రాజ్యాంగ నియమం ప్రకారం శాసనసభ సమావేశాలు జరిపి తీరాలి కాబట్టి జరపడమే తప్ప, దాని సార్థకత ఏ మాత్రం అందుబాటులోకి రావడం లేదు. ప్రజా సమస్యల మీద మాట్లాడే అవకాశమే లేదు. ప్రభుత్వ విధానాలను పరామర్శించే పరిస్థితి లేదు. తప్పులు ఎత్తి చూపే వారు లేరు. వాటిని సరిదిద్దే మాట అసలే లేదు. ఒకప్పుడు ఆంధ్రప్రదేశ్ శాసనసభ అంటే దేశమంతా గౌరవం. సర్దార్ గౌతు లచ్చన్న, పుచ్చలపల్లి సుందరయ్య, తెన్నేటి విశ్వనాథం, ఆ తర్వాతి తరంలో వెంకయ్యనాయుడు, జైపాల్‌రెడ్డి, నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి వంటి ప్రతిపక్ష నేతలు ప్రభుత్వానికి మార్గదర్శనం చూపేవారు. ప్రజల వాణి వినిపించే వారు. ముఖ్యమంత్రులుగా ఉండిన చెన్నారెడ్డి, జనార్ధన్‌రెడ్డి, విజయభాస్కర్‌రెడ్డి, ఎన్టీరామారావు వంటి వారూ ప్రతిపక్షానికి విలువ ఇచ్చే వారు. వారు చెప్పింది వినే వారు. పొరపాట్లు సరిదిద్దుకొనే వారు. ఇప్పటి ప్రతిపక్షం, ప్రభుత్వపక్షం కంటే అధ్వాన్నంగా ఉంది. సభలో మాట్లాడడం కంటే సభ ఆవరణంలోని మీడియా పాయింట్ వద్ద టివి గొట్టాల ముందు కేకలు, అరుపులకే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నారు ఎమ్మెల్యేలు. శాసనసభ చేయవలసిన పని మీడియా చేస్తున్నది. దురదృష్టకరమైన పరిస్థితి ఇది.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

మరణించిన ఘటన దురదృష్టకరమని జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి వ్యాఖ్యానించారు. ఇలాంటి ప్రమాదాలు జరగకుండా తగిన రక్షణ చర్యలు చేపట్టాలని ఆయన అధికారులను ఆదేశించారు. 24వ తేది అధికారులతో సమీక్ష నిర్వహించిన కలెక్టర్ పలు సూచలను చేశారు. పిల్లలకు నీటి ప్రమాదాలపై అవగాహన కల్పించాలని, గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో గల చెరువులు, బావుల వద్ద ప్రమాద హెచ్చరిక బోర్డులు ఏర్పాటు చేయాలని ఆదేశించారు.

## బివిఎస్ఆర్ ఇంట్లో దోపిడీ

ఆత్మకూరు మాజీ శాసనసభ్యుడు, చేయి తిరిగిన డాక్టర్ సుందరరామిరెడ్డి ఇంట్లో 23వ తేదీ దొంగలు చొరబడి దోపిడీ చేశారు. తెల్లవారుజామున జరిగిన ఈ దోపిడీలో దుండగులు కుటుంబ సభ్యుల నుంచి 110 సవర్ల బంగారు నగలు దోచుకెళ్లారు. జిల్లా ఎస్పీ రమణకుమార్ సంఘటనా స్థలాన్ని పరిశీలించారు. బయటి జిల్లా వ్యక్తులే ఈ ఘటనకు పాల్పడినట్లు తెలిపారు. త్వరలోనే దొంగలను పట్టుకొంటామన్నారు. ఈ దోపిడీ ఆత్మకూరులో సంచలనం సృష్టించింది.

## పదరంగం -8

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | | | | | 3 | | 4 |
| | | | | | 5 | | | | | |
| | | | | 6 | 7 | | | 8 | | |
| 9 | 10 | | | | | 11 | | | | |
| | | | | 12 | 13 | | | 14 | | |
| 15 | | | | | 16 | 17 | 18 | | | 19 |
| | | | | 20 | | 21 | | 22 | | |
| 23 | | | 24 | | | | | 25 | | |
| | | | | | | 26 | | | | |
| 27 | 28 | | | | | | | | | |
| | 29 | 30 | | | | | 31 | | 32 | |

**అడ్డం**

1. భూమ్యాకాశాలు (7)
3. సంబంధించిన (3)
5. శబ్దం, అందెల దేనా? (3)
6. ప్రిన్సిపల్ (3)
8. అనుమానం (3)
9. మనముండేది (4)
12. సోమును పిలవండి (2)
14. దేవలోకపు బాతు (2)
15. పుప్పొడి (3)
16. కొలనులోని పువ్వు (3)
21. పూజలోని చెంబు (3)
24. యువతి (4)
25. జాలి (3)
26. ఇంగ్లీష్ రంగు (3)
27. కాపలా దారుడు (3)
29. సరియైనది (4)
31. ఇంగ్లీషు నిలువుదల ఆర్డరు (1)
32. డ్రింకు గొట్టం (ఇంగ్లీషుదే) (1)

**నిలువు**

1. శంకుస్థాపన (4)
2. జనరేషన్ (2)
4. అలాగే చేయండి (4)
7. క్రింద నుంచి సరళను పిలవండి (3)
8. అనుమానమే (3)
10. కింగ్ కోబ్రా (4)
11. క్రింద నుంచి దుస్తులు (4)
13. గుంపు (2)
17. లొసుగులు (5)
18. నెట్ (2)
19. పాదాలు (5)
20. చైత్ర, వైశాఖ మాసాలలో ఋతువు ప్రవేశించింది (5)
22. శివుడు (4)
23. చిన్న కత్తి (3)
28. సారం (2)
30. క్రింది నుంచి మాలిన్యం (3)

**సమాధానాలు**

## పదరంగం -7

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 నం | ద | 2 న | | 3 కి | ల | 4 కి | లా | 5 రా | వా | 6 లు |
| ద | | గ | | ర | | తా | | శి | | వీ |
| నం | | రం | | ణం | | బు | | 7 ఫ | ణి | |
| 8 ద | రి | | 9 శ్రీ | | | | 10 ల | లా | | 11 క |
| ను | | 12 ప్ర | | | 13 మి | | 14 వ | లు | 15 వ | లు |
| డు | | 16 పం | చాం | 17 గ | శ్ర | వ | ణం | | 18 రి | గు |
| | 19 లం | చం | | 20 ధా | మం | | | 21 తా | పం | |
| 22 ర్శి | | | 23 మే | ధ | | 24 తం | | 25 పం | ట | 26 లు |
| ద | | 27 వు | జు | రు | 28 లు | | 29 మి | | | క |
| ర | 30 బూ | | 31 వా | డు | క | 32 భా | ష | | 33 ఆ | డ |
| 34 దూ | ర | వా | ణి | | 35 న | రం | | 36 న | ట | న |

# సంక్షిప్త సింహపురి

## యూనిఫారం చార్జీల మోత

జిల్లాలోని ప్రభుత్వ పాఠశాలల్లో చదువుతున్న బాలబాలికలకు సంవత్సరానికి రెండు జతల యూనిఫారం ప్రభుత్వం అందిస్తుంది. వీటి బాధ్యతలను రాజీవ్ విద్యామిషన్‌కు అప్పగించింది. రాజీవ్ విద్యామిషన్ గుడ్డను కొనుగోలుచేసి దుస్తులను కుట్టించే బాధ్యతను సంబంధిత పాఠశాలల ప్రధానోపాధ్యాయులు చూడాలని ఆదేశించింది. అయితే దుస్తుల తయారీకి మార్కెట్ ధరకంటే చాలా తక్కువగా చెల్లించనుండడంతో టైలర్లు ముందుకు రావడం లేదు. దీంతో ప్రధానోపాధ్యాయులు ఏం చేయాలన్న ఆలోచనలో పడ్డారు. వచ్చే విద్యా సంవత్సరం ప్రారంభమయ్యే నాటికి బాలబాలికలకు అందించే యూనిఫాం సిద్ధం చేయాలన్నది ప్రభుత్వ సంకల్పం. ఇందుకు ఇప్పటి నుంచి కసరత్తు చేస్తున్నారు. ఒక్కో జత యూనిఫారం కుట్టేందుకు టైలర్లు వంద రూపాయలు చార్జీ కింద వసూలు చేస్తారు. రాజీవ్ విద్యామిషన్ అధికారులు మాత్రం 40రూపాయలు ఇస్తామంటున్నారు. వివిధ పనుల పేరుతో కోట్ల రూపాయలు దుర్వినియోగం చేస్తున్న ఈ శాఖ అధికారులు విద్యార్థులకు అందించే యూనిఫారం విషయంలో తిరకాసు పెట్టడం విశేషం.

## వాకర్సు అసోసియేషన్ ఉగాది సంబరాలు

ఏసి.సుబ్బారెడ్డి స్టేడియం వాకర్స్ అసోసియేషన్ నేతృత్వంలో 23తేది ఉదయం స్టేడియంలో ఉగాది సంబరాలు నిర్వహించారు. ఆలూరి శిరోమణి శర్మ పంచాంగ శ్రవణంలో ఈ యేడాది జరిగే మంచిచెడ్డలను సమీక్షించారు. తెలుగుభాష ఔన్నత్యంపై సహస్ర సభా సింహం బివి.నరసింహం వివరించారు. వాకర్సు సంప్రదాయ దుస్తులైన పంచె కండువాలు ధరించి వచ్చారు. కార్యక్రమ అనంతరం ఉగాది పచ్చడి, ప్రసాద వితరణ జరిగింది. వాకర్సు అసోసియేషన్ నేతృత్వంలో ఉగాది ఉత్సవాలను విజయవంతంగా జరపను రాఘవేంద్రశెట్టి, బలరామయ్య నాయుడు, రమేష్ చేసిన కృషిని ఈ సందర్భంగా కొనియాడారు.

## రామనారాయణరెడ్డి విజ్ఞతకే వదలి వేస్తున్నాం!

కోవూరు ఉపఎన్నిక ఫలితంపై పూర్తి బాధ్యత వహిస్తానన్న జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి తన పదవికి రాజీనామా చేస్తారో, లేదో నన్న విషయాన్ని ఆయన విజ్ఞతకే వదలేస్తున్నామని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ యువజన విభాగం జిల్లా అధ్యక్షుడు అనిల్‌కుమార్ యాదవ్ చెప్పారు. రాజీవ్‌భవన్‌లో విలేకరులతో ఆయన మాట్లాడుతూ రానున్న రోజుల్లో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకే రాజకీయ భవిష్యత్తు వుంటుందని, జగన్మోహన్ రెడ్డి ముఖ్యమంత్రి కావడం తథ్యమన్నారు. నెల్లూరు పార్లమెంట్ స్థానానికి త్వరలో జరిగే ఉపఎన్నికలలోనూ తమ పార్టీనే నెగ్గుతుందన్నారు. సమావేశంలో రూప్‌కుమార్ యాదవ్, వెంకటేశ్వర్లురెడ్డి, శ్రీధర్‌రెడ్డి, కృష్ణచైతన్య, నాగార్జున తదితరులు పాల్గొన్నారు.

## క్యాన్సర్ ఆస్పత్రికి ఎస్‌బిఐ విరాళం




నెల్లూరులో రెడ్ క్రాస్ సంస్థ నేతృత్వంలో నడిచే క్యాన్సర్ వైద్యశాలకు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా మేనేజింగ్ డైరక్టర్ ఎ.కృష్ణకుమార్ 20లక్షల రూపాయల విరాళాన్ని జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి చేతుల మీదుగా హాస్పిటల్ చీఫ్ మెడికల్ ఆఫీసర్ డాక్టర్ టి.లక్ష్మి చేతికి అందించారు. ఈ విరాళంతో హాస్పిటల్‌లో లాప్రోస్కోపిక్ పరికరాన్ని ఏర్పాటుచేసి పేద రోగులకు మెరుగైన చికిత్స చేయమని కృష్ణకుమార్ ఈ సందర్భంగా సూచించారు. జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా వితరణ పట్ల కృతజ్ఞతలు తెలియజేశారు. జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్, ఎస్‌బిఐ నెల్లూరు మేనేజర్ భాస్కర్‌బాబు, డాక్టర్ రమేష్, ఎ.యన్.అప్పయ్య, కెటి.అజిత్ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## జనని అనాధ శరణాలయం

మునిసిపల్ ఛైర్మన్ మీటింగ్ క్లర్క్‌గా చాలారోజులు పనిచేసిన యతిరాజులు సతీమణి శ్రీనివాసమ్మ జ్ఞాపకార్థం ఆమె కుమార్తె నీలం పద్మావతి నెల్లూరు చంద్రబాబు నగర్‌లో శ్రీ జనని అనాధ శరణాలయం ప్రారంభించారు. నెల్లూరీయులు తమ దృష్టికి వచ్చిన నిర్భాగ్య అనాధ పిల్లలు, వృద్ధులను తమ శరణాలయంలో చేర్చవచ్చంటున్నారు పద్మావతి. వివరాల కోసం 93475 93775 ఫోను నంబరులో సంప్రదించవచ్చు.

## ఆదర్శంగా నిలచిన వాసవి క్లబ్!




నెల్లూరు వాసవి క్లబ్ – విక్రమ సింహపురి నందన నామ సంవత్సర ఉగాది వేడుకలను విశ్వభారతి అంధుల పాఠశాలలో జరిపింది. ఇక్కడి పిల్లలకు ఉగాది పచ్చడితో పాటు తినుబండారాలను పంచింది. ఈ కార్యక్రమంలో క్లబ్ అధ్యక్షుడు జమిలి శ్రీనివాసరావు, ప్రధాన కార్యదర్శి విజనపల్లి సుగుణకుమార్, కోశాధికారి చీదెళ్ల కిషోర్ క్లబ్ సభ్యులు సతీష్, దుగ్గి శీను, కళ తదితరులు పాల్గొన్నారు.



## రైతు లోకం

# వేరుశనగలో కల్తీ మొక్కలను గుర్తించి వేరు చేయండి!

వేరుశనగ పంటలో వివిధ దశలలో కల్తీ మొక్కలు వస్తుంటాయి. పూత దశ, పంట పెరిగే దశ, పంట వేసేటప్పుడు ఆయా రకాల గుణాలు లేని మొక్కలను కల్తీ మొక్కలుగా గుర్తించి తీసేయాలి. ఉదాహరణకు అభయ, నారాయణి రకం మొక్కలు పంటలో వుంటే పూతదశలో, పంట పెరిగే దశలో సులభంగా గుర్తించవచ్చు. అభయ రకం భిన్నపత్రాలు ముదురాకుపచ్చ రంగులో సన్నగా వుంటాయి. నారాయణి రకం భిన్న పత్రాలు లేత ఆకుపచ్చ రంగులో కొంచెం వెడల్పుగా వుంటాయి. పీకేటప్పుడు కూడా సులభంగా కేళీలను గుర్తించవచ్చు. నారాయణి రకం కాయలలో గింజల మధ్య నొక్కు ప్రస్ఫుటంగా వుండదు. కాయల ఉపరితలం కూడా నారాయణి రకంలో లాగా అంత గరుకుగా వుండదు.

మొక్కలో తీసుకొంటే ఎక్కువ పాళ్లు 3 గింజల కాయలుంటాయి. గింజల రంగులో బాగా వ్యత్యాసముంటుంది. నారాయణి రకంలో గింజలు లేత ఎరుపురంగులో వుంటాయి. అభయ రకంలో గింజలు లేత గులాబీ రంగులో వుంటాయి. మొక్కల పెరుగుదలలోనూ వ్యత్యాసం వుంటుంది.

### పంట తీయడం

పంట పక్వానికి వచ్చినప్పుడే తీయాలి. ముందుగా తీయడం, ఆలస్యంగా తీయడం రెండూ హానికరమే. పంట పక్వ దశకు వచ్చినప్పుడు ఆకులు, కొమ్మలు పసుపు రంగుకు తిరుగుతాయి. కాయ డొల్ల లోపలి భాగం నల్లగా, గోధుమ రంగుకు మారుతుంది. మొక్కలో సుమారు 80శాతం ఈ విధంగా వుంటే పంట పక్వానికి వచ్చినట్లు గుర్తించి తీయాలి. పొలంలో అక్కడక్కడా కొన్ని మొక్కలు తీసి పరిశీలించి ఇలా 80 శాతం కాయలు ముదిరి వుంటే పంట తీయాలి.

డాక్టర్ ఎం.రవీంద్రకుమార్ రెడ్డి,
ప్రధాన శాస్త్రవేత్త & కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

పంట తీసిన తర్వాత మొక్కలను ఓదెలుగా వరుసగా వుంచాలి. కాయలను పరిశీలించి ఏ మొక్కలోనైనా కాయలు ఆయా రకం కాయలను పోలి వుండవో అలాంటి మొక్కలను తీసివేయాలి. తెగులు సోకిన మొక్కలుంటే వాటిని కూడా తీసివేయాలి.



● ఆసక్తికరంగా

# నెల్లూరు పార్లమెంటు, ఉదయగిరి ఉపఎన్నికలు!

ముూలిగే నక్క నెత్తిన తాటికాయ పడ్డట్లు, అసలే అస్తుబిస్తుగా వున్న కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలను ఉపఎన్నికల ఉపద్రవం వెంటాడుతున్నది. రెండు నెలలపాటు కోవూరు ఉపఎన్నికతో నలిగి నాశనమై పోయాయి ఆ రెండు పార్టీలు. ఆ గాయాల నుంచి కోలుకోక ముందే ఉదయగిరి శాసనసభ, నెల్లూరు లోక్‌సభ ఉప ఎన్నికలు ముంగిట నిలబడ్డాయి. జగన్ మీద అలివిమాలిన వ్యామోహంతో మేకపాటి సోదరులిద్దరూ చేసిన రాజీనామాల ఫలితం ఇది.

వారిద్దరూ మహా ఉత్సాహంగా వున్నారు. జిల్లాలో జగన్ గాలి ఝంఝామారుతంగా తోలుతున్నది కాబట్టి, నామినేషన్ వేస్తే గెలిచిపోవడం ఖాయం అన్న ధీమాతో వున్నారు. పైగా ఎన్నికల ఖర్చుకు వెరవలసిన అగత్యం లేదు. ఎన్ని కోట్లయినా క్రుమ్మరించే శక్తి వుంది. జగన్ పార్టీ కార్యకర్తలలో మొన్నటి కోవూరు ఎన్నిక విజయం మంచి వూపునిచ్చింది. కానీ కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు మాత్రం ఎందుకొచ్చిన తద్దినమో ఇదని వాపోతున్నాయి. వారి బాధ అర్ధం చేసుకోదగినదే. గెలుపు మీద ఏ మాత్రం ఆశ లేకుండా ఎన్నికలలో పోటీ చేయవలసి రావడం కంటే పెద్ద శిక్ష రాజకీయవాదికి వేరొకటి వుండదు.

నెల్లూరు లోక్‌సభ పరిధిలో నెల్లూరు నగరం, నెల్లూరు రూరల్, కోవూరు, ఆత్మకూరు, కావలి, ఉదయగిరి, కందుకూరు నియోజకవర్గాలున్నాయి. వాటిలో నాలుగు చోట్ల కాంగ్రెస్ ఎమ్మెల్యేలు, ఒక చోట తెలుగుదేశం ఎమ్మెల్యే, రెండు చోట్ల జగన్ ఎమ్మెల్యేలు వున్నారు. దాదాపు 16 లక్షల ఓట్లున్న నియోజకవర్గం. కోవూరులో వలె డబ్బిచ్చి ఓట్లు కొనడం ఎవరి తరమూ కాదు. ఓటుకు ఐదు వందలు ఇవ్వాలన్నా 80 కోట్లు కావాలి. అంత సొత్తు పోసి ఎన్నికలలో పోటీ చేసి గెలిచినా, ఏడాదిన్నర కూడా వ్యవధి లేదు. మధ్యలో మధ్యంతరం ముంచుకొని వస్తే లోక్‌సభలో పాదం పెట్టక ముందే పదవి వూడి పోతుంది. అంత అస్తుబిస్తు పదవి కోసం అంతంత సొత్తు ధారపోసే త్యాగధనులెవరుంటారు?

ఈ రెండు పార్టీలకు మరొక సమస్య – పోటీకి సిద్ధపడే అభ్యర్థులు ఎవరు అన్నది. కాంగ్రెస్ తరఫున టిక్కెట్ ఇస్తే నేను రెడీ అని నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ముచ్చటపడుతున్నాడు. ఎమ్మెల్యే పదవి మీద మోజు తీరిపోయిందాయనకు. ఒకటికి మూడుసార్లు గెలిచినా, ప్రమోషన్ రాలేదు. మరొకసారి గెలిచినా అంతే. తమ్ముడు రామనారాయణరెడ్డి వున్నంత కాలం మంత్రిత్వం ఆయన్ను వదలి ఈయన ఇంటికి రాదు. పైగా నెల్లూరు నగరంలో వివేకానందరెడ్డి ప్రతిష్ట తారాస్థాయిలో వుందిప్పుడు. గత ఆరేడేళ్లుగా ఆయన చేస్తున్న అపభ్రంశపు పనులకు నెల్లూరు జనం విసిగిపోయి వున్నారు. ఎన్నికలంటూ మళ్లీ తమ దగ్గరకు వస్తే చెప్పుల తోనో, చేటలతోనో సత్కరించడానికి వురవుర లాడుతున్నారు. సినిమా తరహాలో వుండబోతాయి ఆ సన్నివేశాలు. ఆ విషయం గ్రహించినవాడు కాబట్టే, జనానికి ముఖం చూపకుండా రాజకీయాలలో కొనసాగడానికి ఎమ్పీ పదవిని ఎంచుకొంటున్నాడు. ఎంతైనా అతి తెలివిమంతుడు కదా?

ఆయన అదృష్టం – ఈ టిక్కెట్ అడిగే సాహసికులు కాంగ్రెస్‌లో ఎవరూ కన్పించడం లేదు. ఇస్తామంటే పారిపోయే వారైతే కావాల్సినంత మంది వున్నారు. దానితో వివేకా ముచ్చట తీరే అవకాశం వుంది.

తెలుగుదేశంలో అయితే ఆ మాత్రం అవకాశం కూడా లేదు. ఏ జిల్లా నేత కూడా ముందుకు రావడం లేదు. ఎవరో ఒకరిని బలవంతంగా పట్టి తెచ్చి నామినేషన్ వేయించాలి. అది మొక్కుబడికి మాత్రమే.

కొరవ 14వ పేజీలో





Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com